Telugu Dialect Bulletin Series : 5

# తెలుగు మాండలికాలు
## (వరంగల్ జిల్లా)

సంపాదకుడు

డా॥ బూదరాజు రాధాకృష్ణ




తెలుగు అకాడమి
హైదరాబాదు
1977

# సంపాదకీయం

తెలుగు అకాడమి చేపట్టిన ఆంధ్రప్రదేశ్ భాషా సామాజిక పరిశీలన పర్యవసానంగా ఈనాటికి నాలుగు పత్రికలను ప్రచురించడం జరిగింది. కరీంనగర్, కడప, విశాఖ, గుంటూరు జిల్లాలలోని భాషావైవిధ్యాన్ని, ఏకత్వాన్నీ వాటిలో స్థూలంగా వివరించాం. ఇది వరంగల్‌జిల్లాలో జరిగిన పర్యటన పరిశోధన ఫలితంగా వెలువడుతున్న అయిదో పత్రిక. పూర్వ ప్రచురణలకన్నా ఇందులో వివరాలు తక్కువ. ఎటూ సువిస్తృతమైన వ్యాకరణ గ్రంథాన్ని ప్రచురిస్తున్నాం కాబట్టి ఇందులో కేవలం ప్రాథమికాంశాలను మాత్రమే క్లుప్తంగా ప్రదర్శిస్తున్నాం.

అకాడమిలోని పరిశోధన విభాగానికి చెందిన శ్రీ పులిగడ్డ శివానందశర్మ గారే పర్యటన పరిశోధన పూర్తిగా చేశారు – ప్రాథమికాంశాలతో ఈ పత్రికలోని యావద్విషయాలనూ వారే సిద్ధం చేశారు. వారికి మా కృతజ్ఞత.

ఇంత వరకు కరీంనగర్ భాషా విశేషాలకు సంబంధించిన గ్రంథాన్ని ఇంగ్లీషులో సవివరంగా ప్రచురించటం జరిగింది. కడప, విశాఖ భాషా విశేషాలను వివరించే గ్రంథాలు రెండు నెలల్లో ముద్రణకు సిద్ధమవుతాయి. వరంగల్ విశేషాలను సవివరంగా వర్ణించే గ్రంథాన్ని శ్రీ శివానందశర్మగారే సిద్ధం చేశారు. నాలుగైదు నెలల్లో అదిగూడా ప్రచురణకు సిద్ధమవుతుంది.

వరంగల్‌జిల్లా చరిత్ర తెలిసినప్పటికి శాతవాహనరాజ్యంలో భాగంగా ఉండేది. వారి తరవాత దక్షిణ భారత ప్రాంతాలను జయించి పాలించిన ఇక్ష్వాకుల కాలంలోగాని, బృహత్ఫలాయనాదుల కాలంలోగాని భిన్న రాజవంశాలమధ్య చేతులు మారుతుండేది. క్రీ. శ. 7వ శతాబ్దినుంచి ఈ జిల్లాలోని దక్షిణ ప్రాంతాలు తూర్పు చాళుక్యుల సామంతులైన ముదిగొండ చాళుక్యుల అధీనంలో ఉండేవి గాని క్రీ.శ. 8–10 శతాబ్దుల మధ్య జరిగిన రాష్ట్రకూట చాళుక్య యుద్ధాల వల్ల అప్పట్లో శాంతియుతంగా ఉండేవి కావు. క్రీ.శ. 11వ శతాబ్దిలో కాకతీయులు హనుమకొండ రాజధానిగా సామ్రాజ్య విస్తరణ ఆరంభించినప్పటినుంచీ వరంగల్ దశ తిరిగింది. రమారమి 300 సంవత్సరాల పైకాలం సుఖజీవనం గడిపిన ఈ జిల్లా ప్రజలు, ఆ తరవాత బహమన్ (1482–1518), కుతుబ్‌శాహీ (1512–1682), అసఫ్‌జాహీ (1724–1948)ల పరిపాలనలో పారతంత్ర్యం అనుభవించవలసి వచ్చింది. శాతవాహనాదుల కాలంలో ప్రాకృతం, రాష్ట్రకూటుల కాలంలో కన్నడం, కాకతీయుల కాలంలో సంస్కృతం, ముస్లిమ్‌రాజుల కాలంలో ఉర్దూ రాజభాషలుగా ఉండేవి. కాకతీయుల కాలంనుంచీ తెలుగు భాషా సాహిత్యాలకు రాజపోషణ లభించినా రాజభాషా గౌరవం దక్కలేదు. 1956లోనే ఆంధ్రప్రదేశ్ ప్రథమ భాషా సంయుక్త రాష్ట్రంగా అవతరించినా 1966

నుంచిగాని తెలుగు అధికార భాష కాలేదు. అందువల్ల వరంగల్ చరిత్రలో ప్రామాణికమైన తెలుగు భాషారూపానికి తావులేకపోయింది. ఉత్తర దక్షిణాలుగా విస్తరించిన వ్యవహార భేదక రేఖలు రాష్ట్రకూట-చాళుక్య యుద్ధాలనాటి పరిస్థితికి చిహ్నం.

రాకపోకల సౌకర్యాలూ, విద్యావసతులూ, నగరాలూ, పరిశ్రమలూ చాలా తక్కువయినందున జిల్లా కేంద్రస్థానమైన వరంగల్ భాషా ప్రభావం జిల్లా అంతటా కనిపించదు. ఈ విశేషాలన్నీ ఇంగ్లీషులో వెలువడే వివరణాత్మక గ్రంథంలో తెలుస్తాయి. ఇది కేవలం ప్రాథమికాంశాలను సూచించే పత్రిక మాత్రమే.

పర్యటన పరిశోధన చేసి పత్రికను సిద్ధంచేసిన శ్రీ పి. శివానందశర్మ గారికీ, మాండలిక పటాలు గీచి యిచ్చిన కీ.శే॥ డి. దొరైస్వామిగారికీ ముద్రాపకులు శ్రీ దక్షిణ భారత ప్రెస్ వారికీ, అందరికన్నా మిన్నగా ఈ పరిశోధనకు సమస్త సహాయాలూ చేసిన వ్యవహర్తలకూ, తెలుగు అకాడమి పాలకవర్గానికీ మా కృతజ్ఞతలు. ఇటువంటి పరిశోధనలకు భాషాభిమానులంతా చేయూతనిచ్చి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం.

# విషయ సూచిక


వరంగల్ జిల్లా
కేంద్రము
జిల్లాసరిహద్దు
తాలూకాసరిహద్దు
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్‌గేజ్ రైలు మార్గము
నది
సరస్సు, చెరువు
కరీంనగర్ జిల్లా
మెదక్ జిల్లా
నల్గొండ జిల్లా
ఖమ్మం జిల్లా
గోదావరి నది
ఏటూర్ నాగారం
పరఖాల
ములుగు
హసన్‌పర్తి
వరంగల్
నర్సంపేట
చేర్యాల
జనగాం
వరదన్నపేట
మహబూబాబాద్
ఖమ్మం
79° 0'
30'
80° 0'
0 10 20 40
కి.మీ

# 1
# వరంగల్ జిల్లా

నేటి వరంగల్ జిల్లా ఉత్తర అక్షాంశం 17°15' నుంచి 18°40' వరకూ, తూర్పు రేఖాంశం 78° 46' నుంచి 80° 40' వరకూ విస్తరించి ఉన్నది. దీని వైశాల్యం 12,900 చ. కి. మీ ఈ జిల్లాకు సరిహద్దులుగా ఉత్తరాన కరీంనగర్ జిల్లా, తూర్పున ఖమ్మంజిల్లా, దక్షిణాన నల్గొండజిల్లా, పడమట మెదక్ జిల్లాలు ఉన్నయ్.

ఈ జిల్లా అంతటా అక్కడక్కడ చిన్నగుట్టలు విరివిగా ఉన్నయ్. వరంగల్‌కు వాయవ్యదిశలో 16 కి. మీ. దూరంలో ఉన్న చంద్రగిరి గుట్టలవరసా, దానికి పడమరగా 22½ కి.మీ. దూరంలో ఉన్న హసన్‌పర్తి ఇనపగుట్టలూ ముఖ్యంగా చెప్పుకోదగినవి.

వరంగల్‌కు అతి సమీపంలో ఉన్న హనుమకొండ సముద్రమట్టానికి 515 మీ. ఎత్తున ఉన్నది.

ఈ జిల్లాలో ముఖ్యమైన నది గోదావరి జిల్లా ఉత్తరంనుంచి ఆగ్నేయ దిశగా 64 కి. మీ. పొడవున ఈనది ప్రవహిస్తున్నది. దీని తరవాత చెప్పుకోదగినవి మున్నేరు, పాలేరు, కిన్నెరసాని. మున్నేరు పాఖాల చెరువునుంచి బయలుదేరి వైరాతో కలిసి 154 కి. మీ. ప్రవహించి కృష్ణానదిలో సంగమిస్తుంది. పాలేరునది వరంగల్ తాలూకాలో పుట్టి మున్నేరుకు సమానాంతరంగా ప్రవహిస్తూ కృష్ణాజిల్లాలో ఉన్న జగ్గయ్యపేటకు దక్షిణాన కృష్ణానదిలో పడుతున్నది. కిన్నెరసాని నర్సంపేట తాలూకాలో ప్రవేశించి ఖమ్మంజిల్లాలోకి పోతుంది.

ఇక్కడ అత్యధిక ఉష్ణోగ్రత 43°C. అత్యల్ప ఉష్ణోగ్రత 9°C. ఇక్కడ పడే వర్షంలో 80% నైరృతి ఋతుపవనాలవల్ల మాత్రమే లభిస్తుంది. సంవత్సరంలో సరాసరి వర్షపాతం 102 సెం. మీ.

ఈ జిల్లాలో అరణ్యప్రాంతం విస్తారంగా ఉన్నది. అడవుల మొత్తం విస్తీర్ణం 1302 చ. కి. మీ. (1931 లెక్కలనుబట్టి). ఈ అడవుల్లో టేకు, శ్రీగంధం, చండ్ర, బండారు, ఇప్ప, చిన్నంగి, కొడిశ, నల్లమద్ది, వెదురు వృక్షజాతులు విరివిగా ఉన్నయ్. ములుగు, పాఖాల ప్రాంతపు అడవులుదట్టమైనవి.

ఇక్కడ లభించే ఖనిజాల్లో పేర్కొనదగినవి - నేలబొగ్గు, కెంపురాయి ఇనుము, కట్టడపురాయి.

వరంగల్, జనగాం పట్టణాలకు మాత్రమే మునిసిపాలిటీ లున్నయ్.

వరంగల్ పట్టణం జిల్లా కేంద్రమేగాక వ్యాపార కేంద్రం, విద్యా కేంద్రం కూడా. ఇదొక్కటే జిల్లా అంతటిలోనూ పెద్ద పట్టణం.

ఈ జిల్లాలో జనాభా 18,70,982. ఇందులో గ్రామీణ జనాభా 16,19,684 (= 86.57%). చ. కి. మీ. కు జనసాంద్రత 145. మొత్తం జనాభాలో అక్షరాస్యులు 3,40,000. ఇందులో పురుషులు 2,60,000; స్త్రీలు 80,000. మొత్తంలో చదువుకున్న వారిశాతం 18.8. ఇక్కడి ప్రజలకు వ్యవసాయం ముఖ్యవృత్తి.

వరంగల్ జిల్లాలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. ఆ తరవాత క్రమంగా పరిగణించదగినవి లంబాడీ, ఉర్దూ మాండలికాలు.

ఇక్కడ పంటచెరువుల సంఖ్య అత్యధికం. వీటిలో పాఖాల, రామప్ప, లక్నవరం, ఘనపురం, చెరువులు చాలా ప్రసిద్ధి చెందినవి. రామప్ప చెరువు నీటి పరపు వైశాల్యం 206 చ. కి. మీ. లు. లక్నవరం, పాఖాల చెరువుల నీటి పరపు వైశాల్యం వరసగా 192 చ. కి. మీ., 33 చ. కి మీ. లు. ఈ జిల్లాలలో ముఖ్యమైన పంటలు వరి, జొన్న.

ఈ జిల్లా చేతిపనులకు ఎంతో ప్రసిద్ధిచెందింది. పాఖాలలో చత్రంజీలూ, తివాచీలూ తయారుచేస్తారు. హసన్‌పర్తి టస్సారా పట్టు (=తుసార్ సిల్కు) గుడ్డలకు పేరు గాంచింది. మామూలు నేతగుడ్డలు అనేక కేంద్రాలలో తయారవుతున్నయ్.

తోలు పరిశ్రమ, సాధారణ ఇంజనీరింగ్ వర్క్ షాపులూ, బియ్యం మిల్లులూ, వ్యవసాయ పరికరాలను తయారుచేసే యంత్రాగారాలూ మొ॥వి పెద్ద, మధ్య, చిన్న తరహా పరిశ్రమలకు సంబంధించినవి ఇక్కడ ఉన్నయ్.

రాష్ట్రంలోకంతటికీ వరంగల్‌లోగల 'State Azam Zahi Mills' అనేది పెద్ద spinning and weaving mill ఒక Solvent extraction plant, ఒక Chip-Board factory, R C C. spun pipes కోసం ఏర్పడ్డ Indian Hume Pipe Company Unit, Barium Salts Manufacturing Unit అనేవి ఈ జిల్లాలోగల మిగతా పారిశ్రామిక సంస్థలు.

ఈ జిల్లాలో ఉన్న రహదార్ల మొత్తంపొడవు 768 కి. మీ.మాత్రమే.

హైదరాబాదు నుంచి విజయవాడకు పోయే రైలు మార్గం ఈ జిల్లాలోనుంచి పోతుంది. కాజీపేట రైల్వే కూడలి. మద్రాసు – ఢిల్లీ రైలు మార్గం కాజీపేట నుంచి వేరవుతుంది.

ప్రాచీన వస్తు విశేషాలలో ముఖ్యంగా ఎన్నుకోదగినది హన్మకొండలో ఉన్న వెయ్యిస్తంభాల గుడి. దీనిని క్రీ. శ. 1164 లో చాళుక్య శిల్ప పద్ధతులను అనుసరించి కాకతీయ రాజులు కట్టించారు. ములుగు తాలూకాలోని రామప్ప దేవాలయం చాలా అందమైనది. దీనిని క్రీ. శ. 1204లో నిర్మించారు. దీనిలో కాకతీయ శిల్పుల కళాచాతుర్యం ఎంత పరాకాష్ఠ చెందిందో అవగతమవుతుంది. ఈ జిల్లాలో జీడికల్లు, అయినవోలు, కొలనుపాక ముఖ్య పుణ్యక్షేత్రాలు.

# 2
# విషయ సేకరణ

వరంగల్ జిల్లాలో పూర్వపద్ధతిలో (చూ. కరీంనగర్ జిల్లా మొ.) విషయసేకరణ చేయటం జరిగింది. అక్కడి భాషా ప్రామాణ్యనిర్ధారణకు తోడ్పడే విద్యా సాంఘిక సంబంధాల దృష్ట్యా పదిరకాల వ్యవహర్తలను ఎన్ను కున్నాం. వారు—(1) రచయితలు, (2) ఉపాధ్యాయులు, (3) వృత్తివిద్యా వంతులు, (వైద్యులు, న్యాయవాదులు, మొ॥ వారు), (4) ఉద్యోగులు, (5) రాజకీయ కార్యకర్తలు, (6) చదువుకొన్న స్త్రీలు, (7) విద్యార్థులు, (8) పెద్ద వ్యాపారస్థులు, (9) కులవృత్తులవారు, (10) కూలీలు / రైతులు / కార్మికులు. వీరిని విద్యాస్థాయులను బట్టి నాలుగు తరగతులుగా విభజించాం — (a) కళాశాల/విశ్వవిద్యాలయ విద్య, (b) ఉన్నత పాఠశాల విద్య, (c) ప్రాథమిక, మాధ్యమిక పాఠశాల విద్య, (d) చదువుకోనివాళ్ళు. పై పదిరకాల వ్యవహర్తలనే సాంఘిక సంబంధాల దృష్ట్యా మూడు వర్గాలుగా విభజించాం— (A) 1, 2, 3 రకాలవారు, (B) 4, 5, 6, 7, 8 రకాలవారు, (C) 9, 10 రకాలవారు. ఈ విద్యాస్థాయి తరగతులను, సాంఘిక సంబంధ భేదాలను మేళవించి ఆయా వ్యవహర్తల విజ్ఞానస్థాయి (sophistication level) నిర్ణయించాం. ఈ విధంగా వ్యవహర్తలను ఆరు విజ్ఞానస్థాయులకు సంబంధించిన వారుగా విభజించాం. మొత్తంమీద ఎన్నుకున్న 56 మంది వ్యవహర్తలలోనుంచి ఒక్కొక్క విజ్ఞానస్థాయికి సంబంధించిన వారిలో ఇద్దరేసి చొప్పున పన్నెండుగురి ప్రసంగపాఠాలను ఈ గ్రంథంలో ప్రచురిస్తున్నాం. ఇవి కథలరూపంలో, జీవితానుభవాల రూపంలో, స్వాభిప్రాయప్రకటనలరూపంలో ఉన్నయ్.

శ్రీ పులిగడ్డ శివానందశర్మ వరంగల్ జిల్లాలోని పది కేంద్రాలలో డిసెంబరు '73 నుంచి మార్చి '74 వరకు పర్యటన పరిశోధనచేసి 56 మంది వ్యవహర్తలనుంచి విషయసేకరణ చేశారు. వివరాలు పక్కపుటలోని పట్టికలోఉన్నయ్. పట్టికలో చూపిన 56 మందిలో :

I. కులాలు : పద్మశాలీలు (8), వైశ్యులు (7), హరిజనులు (4) రెడ్లు (5), కాపులు (5), బ్రాహ్మణులు (9), సాతానులు (3) తెలగలు (3), వెలమలు (3), యాదవులు (2), ముదిరాజులు (2, గౌడలు (2), మేర(1), బలిజ (1), కుమ్మరి (1)

II. వృత్తి వ్యాపారాలు : రచయితలు (2), పట్టభద్రులు / ఉపాధ్యాయులు (16), ఉద్యోగులు (3), విద్యార్థులు (15), వ్యాపారస్థులు (7), రైతులు (8), ఇతరులు (5).

III. వయోభేదాలు : 20 సం॥లలోపు (9), 21 నుంచి 40 సం॥ల వరకు (27), 41 నుంచి 60 సం॥ల వరకు (19), 60 సం॥లపైన(1).

IV. విజ్ఞాన స్థాయులు : స్థాయి- 7 (16), స్థాయి - 6 ( 2), స్థాయి-5 (10), స్థాయి - 4 (7), స్థాయి - 3 (5), స్థాయి - 2 (6).

V. పురుషులు (49), స్త్రీలు (7).

| క్రమ సంఖ్య | కేంద్రం పేరు | కేంద్ర సంఖ్య | వ్యవహర్తల సంఖ్య | ప్రచురిత వ్యవహార ఖండికల సంఖ్య |
|---|---|---|---|---|
| 1 | పరకాల | (21) | 6 | 1 |
| 2 | ములుగు | (22) | 6 | 2 |
| 3 | హసన్‌పర్తి | (23) | 3 | - |
| 4 | వరంగల్ | (24) | 8 | 2 |
| 5 | మహబూబాబాద్ | (25) | 7 | 2 |
| 6 | ఏటూరినాగారం | (26) | 4 | 1 |
| 7 | వరదన్నపేట | (27) | 3 | - |
| 8 | చేర్యాల | (28) | 4 | 1 |
| 9 | జనగాం | (29) | 7 | 2 |
| 10 | నర్సంపేట | (30) | 8 | 1 |

ఈ గ్రంథంలో వరంగల్ జిల్లాలో వ్యవహారంలో ఉన్న తెలుగు మాండలికంలోని సాంఘిక ప్రాంతీయ వైజ్ఞానిక భేదాలూ, "ప్రామాణిక"భాషతో ఆ మాండలికానికి గల కొన్ని పోలికలూ - భేదాలూ, మాండలికపటాలూ, (సంక్షిప్త) మాండలికపదకోశం పొందుపరచటం జరిగింది.

# 3
# సామాజిక భేదాలు

వరంగల్ మాండలికంలో భాషావిషయకమైన అంశాలు కొన్ని సామాజికంగా (అంటే కులప్రాతిపదికగా తీసుకుంటే) స్ఫుటంగా కనిపిస్తయ్. ఆయాభేదాలను కింది పట్టిక సూచిస్తుంది.

| అంశం | కులాలు[1] |
|---|---|
| I. వర్ణవిభాగం — | |
| 1. (a) మహాప్రాణాలు | వై, సా, బ్రా |
| (b) అల్పప్రాణాలు | రె, కా, ప, హ, మే, బ, తె |
| (a)/(b) | గౌ, ము |
| 2. (a) ణ, ళ లు | వై, కా, బ, బ్రా |
| (b) న, ల లు | రె, ప, వె, గౌ, సా, హ, మే, ము, తె |
| II. పదాంశవిభాగం— | |
| A. నామాలు – బహువచన రూపాలు | |
| 3. (a) వేర్లు మొ॥ వి. | ప, వె, గౌ, హ, మే, ము, కు, బ |
| (b) వేల్లు మొ॥ వి. | రె, వై, కా, బ్రా, సా, తె |
| (a)/(b) | యా |
| 4. (a) నాగన్లు | రె, వై, ప, వె, హ, కు, యా |
| (b) నాగల్లు | బ్రా, బ, కా, గౌ, మే, సా |
| (a)/(b) | ము |
| 5. (a) వెయ్‌లు | సా, హ, కు, యా, బ |
| (b) వేలు | ప, కా, బ్రా, గౌ, మే, తె |
| (a)/(b) | రె, వై, వె, ము |

1. రె–రెడ్లు, బ్రా–బ్రాహ్మణులు, కా–కాపులు, వె–వెలమలు, సా–సాతానులు, ప–పద్మశాలీలు, హ–హరిజనులు, మే–మేరాలు, బ–బలిజలు, తె–తెలగలు, గౌ–గౌడలు, ము–ముతరాసులు, వై–వైశ్యులు, కు–కుమ్మరులు, యా–యాదవులు.

| అంశం | కులాలు |
|---|---|
| B. క్రియలు | |
| 6. వర్తమాన క్రియ (ఉత్తమ పురుష) | |
| (a) వస్తున్న | ప, హా, సా, బ్రా. గా |
| (b) వస్తార | రె, వై, కా, వె, మే, యా |
| (a)/(b) | ము, తె, |
| 7. తద్ధర్మార్థక క్రియ - (ఉత్తమ పురుష) | |
| (a) దుంత | రె, వై, యా, వె |
| (b) దున్నుత | ప, హా, బ్రా, సా, మే, ము, గా |
| 8 వ్యతిరేకతద్ధర్మార్ధక క్రియ - (మహాదితరం = అమహత్) | |
| (a) ఉండదు | బ్రా |
| (b) ఉండది | రె, ప, కా, వె, హా, మే, ము, యా, తె, గా, సా |
| (a)/(b) | వై |
| 9. వ్యతిరేక భూతక్రియ - | |
| (a) పిల్వలే | బ్రా, వె, వై |
| (b) సిల్వతేదు | బ |
| (c) పిల్వలె | హా, రె, మే |
| (a)/(b) | ము, గా |
| (b)/(c) | ప, వై, తె, కా |
| 10. భావార్థకం | |
| (a) చేసేది | మే, బ్రా, తె, గా |
| (b) చేసుడు | ప, హా, బ |
| (a)/(a) | వై, కా, వె, ము, తె |
| 11. వ్యతిరేక భావార్థకం - | |
| (a) చెయ్యంది | రె, బ్రా, వై, కా, మే, ము, సా, గా, తె |
| (b) చెయ్యక పోవ్డు | ప, వె, హా |

| కులం | కులాలు |
|---|---|
| III. శబ్ద విభాగం— బాంధవ్య బోధక పదాలు | |
| 12 తల్లి - | |
| (a) అమ్మ | బ్రా, రె, కా, వె, వై, సా, ము, యా, తె |
| (b) అవ్వ | హ, మే, కు |
| (a)/(b) | ప, గొ |
| 13. తండ్రితల్లి | |
| (a) నాయ్నమ్మ | బ్రా, రె, వె, సా, తె, యా |
| (b) అమ్మ | ప, వై, హ, గొ, మే, ము, కు |
| (a)/(b) | కా |
| 14. తల్లి తల్లి | |
| (a) అమ్మమ్మ | బ్రా, రె, వై, కా, వె, సా, యా, తె |
| (b) అమ్మ | హ, ము, మే, కు |
| (a)/)b) | ప, గొ |
| 15. భర్తసోదరి | |
| (a) ఆడబిడ్డ | ప, వై, బ్రా, కా, వె, సా, ము, తె |
| (a) ఆడిబిడ్డ | హ, మే, యా. కు |
| (a)/(b) | రె. గొ |
| 16. కొడుకు/కూతురు అత్తగారు | |
| (a) వియ్యంపురాలు | బ్రా, సా |
| (b) వియ్యపురాలు | రె, ప, వై, కా, వె, యా, మే, కు, తె |
| (a)/(b) | గొ, ము |

సారాంశం :

1. బ్రాహ్మణులు, వైశ్యులు, సాతానులు, కాపులు/రెడ్లు, తెలగలు విద్యాధికులు మాట్లాడే భాష మాట్లాడతారు.

2. మేరాలు, వెలమలు, యాదవులు, ముతరాసులు, కుమ్మరులు, హరిజనులు, బలిజలు, పద్మశాలీలు, అంతగా విద్యాగంధం లేని వారు మాట్లాడే భాష మాట్లాడుతారు.

3. గౌడల భాషలో అధికవైజ్ఞానిక, అల్పవైజ్ఞానిక లక్షణాలు సమంగా కనబడతయ్.

4. బ్రాహ్మణులు, వైశ్యులు, సాతానులు, కాపులు/రెడ్లు ప్రామాణిక భాష మాట్లాడతారు.

5. మేరాలు, వెలమలు, యాదవులు, ముతరాసులు, కుమ్మరులు, హరిజనులు, ప్రామాణి కేతరమైన మాండలికంలో మాట్లాడుతారు.

6. తెలగలు, గౌడలు, బలిజలు, పద్మశాలీలలో ఈ ప్రామాణిక, ప్రామాణికేతర భాషా లక్షణాలు రెండూ కలగాపులగంగా కనబడతయ్.

# 4
# స్థానిక భేదాలు

వరంగల్ జిల్లా మాండలికంలో కొన్ని అంశాలకు సంబంధించిన భేదాలు జిల్లాలోని వివిధ ప్రాంతాలలో కొట్టవచ్చినట్లు అగపడతయ్. ఆయా భేదాలు ఏయే కేంద్రాలలో ఎలాఎలా ఉన్నయ్యో ఈ కింది పట్టిక నాధారం చేసుకుని తెలుసుకోవచ్చు.

| అంశం | కేంద్రాలు[1] |
|---|---|
| I. వర్ణ విభాగం— | |
| 1. (a) మహాప్రాణాలు | 26, 27, 29 |
| (b) అల్పప్రాణాలు | 21, 22, 23, 25, 28, 30 |
| (a)/(b) | 24 |
| 2. (a) ణ, ళ లు | 21, 22, 27 |
| (b) న, ల లు | 23, 24, 25, 26, 28, 29,30 |
| II. పదాంశ విభాగం— | |
| A. నామాలు - బహువచన రూపాలు | |
| 3. (a) వేర్లు మొ॥ వి | 21, 22, 23, 24, 28, 30 |
| (b) వేల్లు మొ॥ వి | 25, 26, 27, 29 |
| 4. (a) నాగన్లు | 21, 26, 30 |
| (b) నాగల్లు | 22, 23, 24, 27, 28, 29 |
| (a)/(b) | 25 |
| 5. (a) వెయ్‌లు | 21, 24, 27, 30 |
| (b) వేలు | 23, 25, 26, 29 |
| (a)/(b) | 22, 28 |

1. 21 - పరకాల, 22 - ములుగు, 23 - హసన్‌పర్తి, 24 - వరంగల్, 25 - మహబూబాబాద్, 26 - ఏటూర్ నాగారం, 27 - వరదన్నపేట, 28 - చేర్యాల, 29 - జనగాం, 30 - నర్సంపేట.

| అంశం | కేంద్రాలు |
|---|---|
| B. క్రియలు | |
| 6. వర్తమానక్రియ - (ఉత్తమ పురుష) | |
| (a) వస్తున్న | 23, 24, 27, 28, 29, 30 |
| (b) వస్తాన | 21, 22, 25. 26 |
| 7. తద్ధర్మార్థక క్రియ - (ఉత్తమ పురుష) | |
| (a) దుంత | 21, 24, 27, 30 |
| (b) దున్నుత | 22, 23, 25, 26 |
| 9. వ్యతిరేక తద్ధర్మార్థకక్రియ - (మహదితర=అమహత్) | |
| (a) ఉండదు | 24, 25, 27 |
| (b) ఉండది | 21, 23, 26, 28, 29 |
| (a)/(b) | 22, 30 |
| 9. వ్యతిరేక భూతక్రియ - | |
| (a) పిల్వలే | 27 |
| (b) పిల్వలేదు | 22, 23, 24 |
| (c) పిల్వలె | 21, 25. 28, 29, 30 |
| (a)/(b) | 26 |
| 10 భావార్థకం | |
| (a) చేసేది | 22, 23, 25, 30 |
| (b) చేసుడు | 21, 24, 26, 27, 28, 29 |
| 11. వ్యతిరేక భావార్థకం | |
| (a) చెయ్యంది | 21, 22, 25, 30 |
| (b) చెయ్యకపోవ్డు | 24, 26, 27, 28, 29 |

| అంశం | కేంద్రాలు |
|---|---|
| III. శబ్ద విభాగం— | |
| A బాంధవ్య బోధకపదాలు | |
| 12. తల్లి | |
| (a) అమ్మ | 23, 24, 25, 27, 29, 30 |
| (b) అవ్వ | 21, 22 |
| (a)/(b) | 26, 28 |
| 13. తండ్రి తల్లి | |
| (a) నాయ్నమ్మ | 23, 25, 27, 29, 30 |
| (b) అమ్మ | 22, 26 |
| (a)/(b) | 21, 24, 28 |
| 14. తల్లి తల్లి | |
| (a) అమ్మమ్మ | 23, 24, 25, 27, 29, 30 |
| (b) అమ్మ | 21, 22, 26 |
| (a)/(b) | 28 |
| 15. భర్తసోదరి | |
| (a) ఆడబిడ్డ | 22, 23, 24, 25, 27, 30 |
| (b) ఆడిబిడ్డ | — |
| (a)/(b) | 21, 26, 28, 29 |
| 16. కొడుకు/కూతురు అత్తగారు | |
| (a) వియ్యంపురాలు | 23, 27, 30 |
| (b) వియ్యపురాలు | 21, 22, 24, 25, 26, 28, 29 |

సారాంశం :

1. ములుగు, హసన్‌పర్తి, మహబూబాబాద్, వరదన్నపేట, జనగాంలలో ప్రామాణికభాష అధికంగా వాడుకలో ఉన్నట్టు తెలుస్తున్నది.
2. పరకాల, ఏటూర్ నాగారం, చేర్యాల, నర్సంపేటలలో ప్రామాణికేతర మైన జిల్లా మాండలికం అధికంగా వాడుకలో ఉన్నది.
3. వరంగల్‌లో మాత్రం ప్రామాణిక, ప్రామాణికేతర లక్షణాలు రెండూ సమంగా ఉన్నయ్.

గమనిక :

(a) రహదారిపైనగాని, రైలుమార్గం మీదగాని ఉన్న (అంటే రాకపోకల సౌకర్యం అధికంగా గల) పట్టణాలలో ప్రామాణిక భాషా లక్షణాలు అధికంగా ఉన్నయ్.

(b) రహదారిపైన జిల్లా మధ్యప్రాంతానికి సుదూరంలో ఉన్న ఏటూర్ నాగారంలోనూ, పైన చెప్పిన రెండు మార్గాలకూ దూరంగా ఉన్న పరకాల, చేర్యాల నర్సంపేటలలోనూ ప్రామాణిక భాషాప్రభావం తక్కువగా ఉండి జిల్లా మాండలిక రూపాలే అధికంగా వాడుకలో ఉన్నయ్యని చెప్పవచ్చు.

(c) జిల్లా కేంద్రమూ, రవాణాసౌకర్యాధిక్యమూ కలిగిన వరంగల్ పట్టణంలో అటు ప్రామాణిక భాషాప్రభావమూ, ఇటు మాండలిక ప్రభావమూ సమపాళ్ళల్లో ఉన్నయ్.

# 5
# వైజ్ఞానిక భేదాలు

భిన్న వైజ్ఞానిక స్థాయుల బట్టి ప్రజలు మాట్లాడే భాష వారి వారి వ్యవహారంలో భిన్నంగా గోచరిస్తుంది. వైజ్ఞానిక స్థాయిల ననుసరించి వరంగల్ జిల్లాలో వాడుకలో ఉన్న భాష ఎలా ఉంటుందో ఈ కింది పట్టిక చూస్తే బోధపడుతుంది.

| అంశం | వైజ్ఞానిక స్థాయి[1] |
|---|---|
| I. వర్ణ విభాగం— | |
| 1. (a) మహాప్రాణాలు | అధిక |
| (b) అల్పప్రాణాలు | అల్ప |
| 2. (a) ణ, ళ లు | అధిక |
| (b) న, ల లు | అల్ప |
| II. పదాంశ విభాగం— | |
| A. నామాలు - బహువచన రూపాలు | |
| 3. (a) పేర్లు మొ॥ వి | అల్ప |
| (b) వేల్లు మొ॥ వి | అధిక |
| 4. (a) నాగన్లు | అల్ప |
| (b) నాగల్లు | అధిక |
| 5. (a) వెయ్‌లు | అల్ప |
| (b) వేలు | అధిక |
| B. క్రియలు | |
| 6. వర్తమాన క్రియ (ఉత్తమ పురుష) | |
| (a) వస్తున్న | అధిక |
| (b) వస్తాన | అల్ప |

1. అధిక - 7, 6 విజ్ఞాన స్థాయులు: మధ్య - 5, 6 విజ్ఞాన స్థాయులు; అల్ప - 3, 2 విజ్ఞాన స్థాయులు. (చూ. 3, 4 పేజీలు).

| అంశం | వైజ్ఞానిక స్థాయి |
|---|---|
| 7. తద్ధర్మార్థక క్రియ - (ఉత్తమపురుష) | |
| (a) దుంత | అధిక |
| (b) దున్నుత | అల్ప |
| 8. వ్యతిరేక తద్ధర్మార్థక క్రియ - (మహాదితరం = అమహాత్) | |
| (a) ఉండదు | అధిక |
| (b) ఉండది | అల్ప |
| 9. వ్యతిరేక భూతక్రియ | |
| (a) పిల్వలే | అధిక |
| (b) పిల్వలేదు | మధ్య |
| (c) పిల్వలె | అల్ప |
| 10. భావార్థకం | |
| (a) చేసేది | అధిక |
| (b) చేసుడు | అల్ప |
| 11. వ్యతిరేక భావార్థకం | |
| (a) చెయ్యంది | అధిక |
| (b) చెయ్యక పోవ్డు | అల్ప |
| III. శబ్ద విభాగం — | |
| A. బాంధవ్య బోధక పదాలు | |
| 12. తల్లి | |
| (a) అమ్మ | అధిక |
| (b) అవ్వ | అల్ప |
| 13. తండ్రితల్లి | |
| (a) నాయ్నమ్మ | అధిక |
| (b) అమ్మ | అల్ప |

| అంశం | వైజ్ఞానిక స్థాయి |
|---|---|
| 14. తల్లి తల్లి | |
| (a) అమ్మమ్మ | అధిక |
| (b) అమ్మ | అల్ప |
| 15. భర్త సోదరి | |
| (a) ఆడబిడ్డ | అధిక |
| (b) ఆడిబిడ్డ | అల్ప |
| 16. కొడుకు/కూతురు అత్తగారు | |
| (a) వియ్యంపురాలు | అధిక |
| (b) వియ్యపురాలు | అల్ప |

సారాంశం :

(1) అధిక వైజ్ఞానిక స్థాయి వారు ఆధునిక ప్రామాణిక భాష (MST) మాట్లాడతారు.

(2) అల్ప వైజ్ఞానిక స్థాయి వారు స్థానిక ప్రామాణికం (Local standard) మాట్లాడతారు.

# 6

# వరంగల్ మాండలికం – ప్రామాణిక భాష

ప్రామాణిక భాష - సూటిగా చెప్పాలంటే ఆధునిక వ్యావహారిక ప్రామాణిక భాష - యొక్క స్వరూపం నిర్ణయం చెయ్యాలంటే ఈ వరంగల్ మాండలిక స్వరూప సముపార్జనకు జరిపిన పరిశోధనా పద్ధతిలో తెలుగు మాండలికాల రూపాలను (ప్రాంతీయ, సామాజిక, స్థానిక, వైజ్ఞానిక వ్యత్యాసాలతో సహా) అవగతం చేసుకోవాలి. కాబట్టి తెలుగునాట ఉన్న అన్ని జిల్లాల నుండి ఆయా జిల్లాలలో వాడుకలో ఉన్న భాషా స్వరూప సేకరణం జరగవలసి ఉంది. ఇప్పటికి అయిదు జిల్లాలలో మాత్రం ఈపని చెయ్యటం పూర్తయింది. మిగతా జిల్లాలలో పని పూర్తి చెయ్యటానికి మరికొంత కాలం పడుతుంది.

ఇంతకు పూర్వం కొంతమంది భాషావేత్తల (కందుకూరి వీరేశలింగం పంతులు[1], ఆర్డెన్ పండితుడు[2], ఆచార్య భద్రిరాజుకృష్ణమూర్తి[3], గెరాల్డ్ కెల్లీ[4]) అభిప్రాయాల ననుసరించి ప్రామాణిక భాష (మాండలికం) కోస్తా జిల్లాల మధ్య ప్రాంతంలో వాడుకలో ఉన్న మాండలికంగా గోచరిస్తున్నది. అందుచేత ప్రస్తుతానిక ఈ మాండలికానికీ వరంగల్ మాండలికానికీ గల భేదాలూ, సామ్యాలూ ఈ వ్యాసంలో చర్చించటం జరుగుతున్నది.

---

1. K. Veeresalingam, "Introduction to C. P. Brown's Telugu - English dictionary" second revised edition, p. iv.
2. Arden's quotation cited by G. V. Apparow, "Minute of Dissent" p. 43.
3. Bh. Krishnamurti, "Telugu Verbal Bases" Berkely, 1961. p. 235.
4. Gerald Kelly, "Telugu" in "Current Trends in Linguistics - Vol. V". Mouton - 1969 -p. 383.

A. వర్ణ నిర్మాణ విభాగం

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (1) అచ్చులు | — | ఐ |
| (2) హల్లులు | | |
| (i) ఊష్మాలు | శ[1] | శ[2], ష |
| (ii) అనునాసికాలు | న | న, ణ |
| (iii) పార్శ్వికాలు | ల | ల, ళ |
| (3) క, గ ల ముందొచ్చే న ఉచ్చారణ | ఙ/న | ఙ |
| (4) మహాప్రాణధ్వనులు[3] | లేవు | ఉన్నయ్ |

B. పదాంశ విభాగం

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| I. నామ విభాగం | | |
| (1) బహువచన ప్రత్యయం | లు[4] | లు (లుఙ ళు) |
| (a) కావడి, లేడి, కోడి, గుడి, ముడి, తాడు, వాకిలి, నెమలి, మొసలి, తోలు, వేలు, కాలు, కీలు, చాలు, రాయి | ల్+లు>ల్లు | ల్+లు>ళ్లు |
| (b) కోడలు, నాగలి, కొడవలి, గొడ్డలి, చెల్లెలు, కన్ను, ముల్లు, పడు. | న్+లు>న్లు | ల్+లు>ళ్లు |

1. ద్రోణికోష్మ.
2. వివృతోష్మ.
3. వరంగల్ మాండలికంలో మహాప్రాణలోపంచేసి ఉచ్చరించటం అత్యధికంగా విన బడుతుంది.
4. మూర్ధన్యోచ్చారణ అత్యల్పం కావడం కారణం.

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (c) పండు, గుండు, బండి, ఇల్లు, ముల్లు. | న్డ్+లు>న్డ్లు | ల్+లు>ళ్లు |
| (d) నోరు, గోరు, వేరు, ఊరు, వెదురు. | ర్+లు>ర్లు | ల్+లు>ళ్లు |
| (e) చేను, పేను. | న్+లు>న్లు | ∅+లు>లు |
| (2) విభక్తి ప్రత్యయాలు. | | |
| (a) షష్ఠీ విభక్తి | | |
| దేవుడు, తమ్ముడు, పిల్లవాడు, etc. | దేవుని, etc. | దేవుడి, etc. |
| (b) సహచారి సంబంధకారకం (తృతీయా విభక్తి) | | |
| బార్రెతో, తమ్ముడ్తోన్, ఫ్రేమిలీతోని, బటుల్తోటి | -తో, -తోన్, -తోని, -తోటి, | -తో |
| (c) నిమిత్తార్థకాలు | | |
| ఉజ్జోగం కొరుక్క, లోను కొరకు, ఫ్వ్యాచరోక్కసం, తబాయిదా[1] కోసం. | -కొరకు, -కోసం | -కోసం |
| (d) అభ్యంతరార్థకాలు | | |
| మదిర్ల, ఇంట్ల, భాగంలో, కొట్టులో, రూపాయిల్లోపట, దొంగిలించటం లోపల, వాట్లల్ల, కాద్యాలల్ల. | -ల, -లో, -లోపట, -లోపల, -అల్ల | -లో |
| పక్కకు, పక్కలో | -కు, -లో | -న |

1. =transfer.

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (e) అపాదాన కారకాలు | | |
| అక్కడ్కెల్లి, మొదల్గాలె | -కెల్లి, -గాలె, | |
| అన్నించెల్లి | -నించెల్లి | -నించి |
| (f) ఉపర్యర్థకాలు | | |
| గుట్టపై, క్రుశ్శై | -పై | -మీద |
| (g) అవధ్యర్థకాలు | | |
| అక్కడ్దనక, ఒంటిగంట దాక | -దాక, -తనక | -దాక |
| (h) సమీపార్థకాలు | | |
| ఇంటివద్ద, మాదగ్గర, ఇంటికాడ | -వద్ద, -దగ్గర, -కాడ | -దగ్గర |
| (i) అభిముఖార్థకాలు | | |
| చెరువుమ్రందట | -ముందట | -ముందు |
| (j) నిర్ణీతసమయార్థకం | | |
| సాయంత్రంవరకు | -వరకు | -కి |
| (3) (a) భావార్థకాలు | చెప్పుడు, etc. | చెప్పటం, etc. |
| (b) వ్యతిరేక భావార్థకాలు | చెక్పక పోవ్డు, etc. | చెప్పకపోవటం, etc. |

II. క్రియా విభాగం

(1) భూతకాలిక ప్రత్యయం

| | | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|---|
| ఉత్తమ | ఏ | -ఇన-/-న- | -ప్డా-/-నా- |
| | బ | ,, | ,, |
| మధ్యమ | ఏ | ,, | ,, |
| | బ | -ఇన్-/-న- | ,, |

| | | | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణిక భాష |
|---|---|---|---|---|
| ప్రథమ | ఏ | మహత్ | -ఇన్-/-న- | -ఏ-/-నా- |
| | | మహదితర | ,, | -ఇన్-/-న- |
| | బ | మానవ | ,, | -ఏ-/-నా- |
| | | మానవేతర | -ఇన-/-న- | -ఇన-/-న- |

(2) తద్ధర్మార్థక ప్రత్యయం

| | | | | |
|---|---|---|---|---|
| ఉత్తమ | ఏ | | -త-/-ట- | -తా-/-టా- |
| | బ | | ,, | ,, |
| మధ్యమ | ఏ | | ,, | ,, |
| | బ | | ,, | ,, |
| ప్రథమ | ఏ | మహత్ | ,, | ,, |
| | | మహదితర | ,, | -తుం-/-టుం- |
| | బ | మానవ | ,, | -తా-/-టా- |
| | | మానవేతర | ,, | -త-/-ట- |

(3) వర్తమానకాలిక ప్రత్యయం

| | | | |
|---|---|---|---|
| ఉత్తమ | ఏ | -తున్న-/-టున్న- | -తున్నా-/-టున్నా- |
| | బ | ,, | ,, |
| మధ్యమ | ఏ | ,, | ,, |
| | బ | ,, | ,, |

| | | | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|---|---|
| ప్రథమ | ఏ | మహత్ | -తున్న-/-టున్న- | -తున్నా-/-టున్నా- |
| | | మహదితర | ,, | -తున్న-/-టున్న- |
| | బ | మానవ | ,, | -తున్నా-/-టున్నా- |
| | | మానవేతర | ,, | -తున్న-/-టున్న- |

(4) సామర్థ్యార్థకాలు

| | | | | |
|---|---|---|---|---|
| ఉత్తమ | ఏ | | -త-/-ట- | తుమర్థం+గల- |
| | బ | | | ,, |
| మధ్యమ | ఏ | | ,, | ,, |
| | బ | | | ,, |
| ప్రథమ | ఏ | | ,, | ,, |
| | | మహదితర | ,, | ,, |
| | బ | మానవ | ,, | ,, |
| | | మానవేతర | ,, | ,, |

(ఇవన్నీ తద్ధర్మార్థక రూపాలే)

(5) నిశ్చయార్థకాలు

| | | |
|---|---|---|
| సర్వపురుషలకు, సర్వవాచకాలకూ, ఉభయవచనాలకూ | -ఆలె | -ఆలి |

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (2) బహువచన ప్రత్యయంతోవచ్చేపదాల చివరి-జు,-వులు లోపించటం. | వైకల్పికం | జరగదు |
| ఉదా : | | |
| | రోలు/రోజులు | రోజులు |
| | చెర్లు | చెరువులు |
| | జంతులు/జంతువులు | జంతువులు |
| | పశులు | పశువులు |
| (3) కొన్ని పదాల్లో మాత్రమే రెండో అక్షరం (syllalle) లోపించటం. | వైకల్పికం | జరగదు |
| ఉదా : | | |
| | తేపాతే/లేకపోతే | లేకపోతే |
| | ఊకె | ఊరికే |
| | ఊకో | ఊరుకో |
| | రోని | రోహిణి |
| (4) పదంలో తృతీయాచ్చు హ్రస్వమైతే అది లోపించటం. | వైకల్పికం | జరగదు |
| ఉదా : | | |
| | జరుగ్తుంది/జరుగుతుంది | జరుగుతుంది. |
| | ఎతుక్తున్రు | ఎతుకుతున్నారు. |
| | మాదిగ్లు | మాదిగలు |
| | సోమత్లు/సోమతలు | స్తోమతలు |

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| II. పదాంత అజ్లోప సంధి. | జరుగుతుంది | జరగదు |
| ఉదా : (1) /-ఉ/ | | |
| | నాక్చదువురాదు | నాకుచదువురాదు |
| | వాళ్లక్జర మొచ్చింది | వాళ్లకు జర మొచ్చింది |
| | పరీక్షక్పోయిన | పరీక్షకు పోయ్ నాను |
| | మాక్సెలవు | మాకు సెలవు |
| | నాక్నేను | నాకు నేను |
| | నాలుగ్పుట్లు | నాలుగుపుట్లు |
| | నాలుగ్సంవత్సరాలు | నాలుగు సంవత్సరాలు |
| | తెలుగ్మీడియం | తెలుగుమీడియం |
| | నాలుగ్వేలు | నాలుగు వేలు |
| | అట్పక్క | అటుపక్క |
| | అన్నడ్గద | అన్నాడుగదా! |
| | మూడ్మైళ్లు | మూడుమైళ్లు |
| | ఇద్దర్కొడుకులు | ఇద్దరు కొడుకులు |
| | ఇద్దర్వంటమన్సులు | ఇద్దరు వంట మనుషులు |
| (౨) /-ఇ/ | | |
| | బడ్ఫీజు | బడిఫీజు |
| | మచ్చతరగత్కుటుంబం | మధ్యతరగతి కుటుంబం |
| | పద్మైళ్లు | పదిమైళ్ళు |
| | పద్వేలు | పది వేలు |
| | గాల్కవిత్వాలు | గాలి కవిత్వాలు |
| | ముసల్వాడు | ముసలివాడు |

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (3) /-అ/ | | |
| | ఒకా్సరి | ఒకసారి |
| | ఒకూ్మడు | ఒకమూడు |
| | ఒక్రోజు | ఒకరోజు |
| | మంచిగ్మెదుల్తాండు | (=బాగా ప్రవర్తిస్తున్నాడు) |
| | అక్కడ్గడిప్న | అక్కడ గడిప్తాను |
| | ఇక్కడ్వేస్తేరు | ఇక్కడ వేస్తేరు |
| | బుద్వారం | బుధవారం |
| | గ్రుహ్వాసతి | గ్రుహావసతి |
| (2) ద్వితీయ పదాది హల్లు నాద ధ్వని కావటం. | హెచ్చుగా జగుగుతుంది | ఎక్కువగా జరగదు |
| ఉదా : | | |
| | కొంత గాలం | కొంత కాలం |
| | సిగ్రెట్లు దాగుడు | సిగరెట్లుతాగటం |

D. పదజాలం

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (1) సర్వనామాలు | | |
| ప్రథమ (ఏ-మహత్) | అతడు/అతను | అతను |
| ప్రథమ (ఏ-మహత్) (గౌరవసూచకం) | — | వారు (respectful sg.) |
| ప్రథమ (ఏ-మహతీ) | ఆమె | ఆవిడ/ఆమె |
| ఉత్తమ (బ-అస్మిదర్థకం-ద్వితీయా) | మమ్ముల్ - | మమ్మల్ - |
| మధ్యమ (బ-ద్వితీయా) | మిమ్ముల్ - | మిమ్మల్ - |

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (2) సంఖ్యావాచకాలు | | |
| | అద్ద- | అర- |
| | ఎనమండుగురు | ఎనిమిదిమంది |
| | తొమ్మండుగురు | తొమ్మిదిమంది |
| (3) క్రియారూపాలు | | |
| | తెల్వదు | తెలీదు |
| | విచారియ్యను | విచారించను |
| | దుంతయ్ | దున్నుతయ్ |
| | అయ్‌తడు | అప్‌తాడు |
| | చెయ్యదు/ చెయ్యది | చెయ్యదు |
| (4) బాంధవ్య బోధక పదాలు | | |
| i తల్లిసోదరుడు | మామ | మేనమామ |
| ii తండ్రిసోదరి | అత్త | మేనత్త |
| iii సోదరికుమారుడు | అల్లుడు | మేనల్లుడు |
| iv సోదరికుమార్తె | కోడలు | మేనకోడలు |
| v అక్క | అక్క | అక్కయ్య |
| vi అన్న | అన్న | అన్నయ్య |
| vii చెల్లెలు | చెల్లె | చెల్లెలు |
| viii తండ్రి | నాయ్న | నాన్న |
| ix తల్లిసోదరునిభార్య | అత్త | అత్తయ్య |
| x తండ్రిసోదరిభర్త | మామ | మామయ్య |
| xi భార్య/భర్త తండ్రి | మామ | మామగారు |
| xii భార్య/భర్త తల్లి | అత్త | అత్తయ్య |
| xiii భర్త అన్న | బావ | బావగారు |
| xiv భర్తసోదరుని భార్య | యారాలు | తోడికోడలు |
| xv భార్య సోదరి భర్త | సడ్డకుడు | షడ్డకుడు/ తోడల్లుడు |
| xvi కూతురు | బిడ్డ | కూతురు |
| xvii కూతురు/కొడుకు మామగారు | వియ్యంపుడు | వియ్యంకుడు |

[గమనిక : iii, iv అంశాలు మగవారికి సంబంధించి మాత్రమే.]

(5) ఇతరపదాలు (చూ. అనుబంధం.)

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (3) /-అ/ | | |
| | ఒక్సారి | ఒకసారి |
| | ఒక్మూడు | ఒకమూడు |
| | ఒక్రోజు | ఒకరోజు |
| | మంచిగ్నొదుల్తాండు | (=బాగా ప్రవర్తిస్తున్నాడు) |
| | అక్కడ్గడిప్న | అక్కడ గడిప్తాను |
| | ఇక్కడ్వేస్తేరు | ఇక్కడ వేస్తేరు |
| | బుద్వారం | బుధవారం |
| | గ్రుహ్వసతి | గ్రుహవసతి |
| (2) ద్వితీయ పదాది హల్లు నాద ధ్వని కావటం. | హెచ్చుగా జగుగుతుంది | ఎక్కువగా జరగదు |
| ఉదా : | | |
| | కొంత గాలం | కొంత కాలం |
| | సిగ్రెట్లు దాగుడు | సిగరెట్లుతాగటం |

D. పదజాలం

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (1) సర్వనామాలు | | |
| ప్రథమ (ఏ-మహత్) | అతడు/అతను | అతను |
| ప్రథమ (ఏ-మహత్) (గౌరవసూచకం) | — | వారు (respectful sg.) |
| ప్రథమ (ఏ-మహతీ) | ఆమె | ఆవిడ/ఆమె |
| ఉత్తమ (బ-అస్మిదర్థకం-ద్వితీయా) | మమ్ముల్- | మమ్మల్- |
| మధ్యమ (బ-ద్వితీయా) | మిమ్ముల్- | మిమ్మల్- |

| | వరంగల్ మాండలికం | ఆధునిక ప్రామాణికభాష |
|---|---|---|
| (2) సంఖ్యావాచకాలు | | |
| | అద్ద- | అర- |
| | ఎనమండుగురు | ఎనిమిదిమంది |
| | తొమ్మండుగురు | తొమ్మిదిమంది |
| (3) క్రియారూపాలు | | |
| | తెల్వదు | తెలీదు |
| | విచారియ్యను | విచారించను |
| | దుంతయ్ | దున్నుతయ్ |
| | అయ్తడు | అప్తాడు |
| | చెయ్యదు/ చెయ్యది | చెయ్యదు |
| (4) బాంధవ్య బోధక పదాలు | | |
| i తల్లిసోదరుడు | మామ | మేనమామ |
| ii తండ్రిసోదరి | అత్త | మేనత్త |
| iii సోదరికుమారుడు | అల్లుడు | మేనల్లుడు |
| iv సోదరికుమార్తె | కోడలు | మేనకోడలు |
| v అక్క | అక్క | అక్కయ్య |
| vi అన్న | అన్న | అన్నయ్య |
| vii చెల్లెలు | చెల్లె | చెల్లెలు |
| viii తండ్రి | నాయ్న | నాన్న |
| ix తల్లిసోదరునిభార్య | అత్త | అత్తయ్య |
| x తండ్రిసోదరిభర్త | మామ | మామయ్య |
| xi భార్య/భర్త తండ్రి | మామ | మామగారు |
| xii భార్య/భర్త తల్లి | అత్త | అత్తయ్య |
| xiii భర్త అన్న | బావ | బావగారు |
| xiv భర్తసోదరుని భార్య | యారాలు | తోడికోడలు |
| xv భార్య సోదరి భర్త | సడ్డకుడు | షడ్డకుడు/ తోడల్లుడు |
| xvi కూతురు | బిడ్డ | కూతురు |
| xvii కూతురు/కొడుకు మామగారు | వియ్యంపుడు | వియ్యంకుడు |

[గమనిక : iii, iv అంశాలు మగవారికి సంబంధించి మాత్రమే.]

(5) ఇతరపదాలు (చూ. అనుబంధం.)

# 7
# మాండలిక పటాలు

రాబోయే పేజీల్లో పదిహేను మాండలిక పటాలు ఉన్నయ్. వాటిలో మొదటి పన్నెండు పటాలు పన్నెండు భాషా విషయకాంశాలు ఆధారంగా తయారైనవి. పదమూడోది ఆ పటాల్లో 4-9 వరకు గల పటాలను ఉపరిన్యస్తం చేయగా వచ్చినది. అట్లాగే 1-3 పటాలనూ, 10-12 పటాలనూ ఉపరిన్యస్తం చేయగా వచ్చినవి 14, 15 పటాలు. పటాలన్నింటినీ (1-12) ఉపరిన్యస్తం చేయగా వచ్చిన పటం పదహారోది.

చివరిపటాన్ని (16 ను) బట్టి చూస్తే వరంగల్ జిల్లాలో ఉన్న రైలు మార్గంమీద గల కేంద్రాలలోనూ, వాటికి దక్షిణాన ఉన్న ప్రాంతానికీ; జిల్లాలోని మిగతా ప్రాంతానికీ మధ్య కొంత స్పష్టమైన భేదం ఉన్నట్లు కనిపిస్తుంది. దీనిని బట్టి ఈ జిల్లాలో రెండు స్థానిక మాండలిక ప్రాంతాలున్నట్టు తెలుస్తున్నది.


MAP 7
21
22
23
24
25
26
27
28
29
30
0 10 20 40 కి.మీ

# 8
# వ్యవహర్తల వివరాలు

| వ్యవహర్త సంఖ్య | వ్యవహర్త వృత్తి | గ్రామం | కులం | వయస్సు (సం॥లు) | చదువు |
|---|---|---|---|---|---|
| 1. | కాలేజ్ లైబ్రేరియన్ | మహబూబాబాద్ | రెడ్డి | 36 | బి.ఏ. |
| 2. | జూనియర్ కాలేజ్ లెక్చరర్ (రచయిత) | జనగాం | బ్రాహ్మణ | 40 | యం.ఏ ,బీ,ఎడ్. బీ. ఓ. యల్. |
| 3. | రైతు | ములుగు | ము. కాపు. | 54 | 5 వ తరగతి |
| 4. | బేంకు ఉద్యోగి | పరకాల | హరిజన్ | 22 | హెచ్.యస్. సి. |
| 5. | హాస్టల్ వార్డెన్ | చేర్యాల | ము. కాపు. | 40 | 9 వ తరగతి |
| 6. | కాలేజి విద్యార్థి | నరసంపేట | ము. కాపు. | 18 | ఇంటర్- 2 వ సం. |
| 7. | రైతు | ఏటూర్నాగారం | వైశ్య | 40 | 7 వ తరగతి |
| 8. | కిరాణా వ్యాపారి | వరంగల్ | బలిజ | 58 | 4 వ తరగతి |
| 9. | వీవింగ్ సెంటర్ సూపర్వైజర్ | ములుగు | పద్మశాలి | 33 | 4 వ తరగతి |
| 10, | బేంకు ఉద్యోగి | వరంగల్ | వైశ్య | 24 | బీ. యస్. సి. |
| 11. | కూలి పని వాడు | మహబూబాబాద్ | యాదవ | 60 | లేదు. |
| 12. | రైతు/రోడ్ల కంట్రాక్టరు | జనగాం | హరిజన్ | 50 | లేదు. |

| స్థాయి | వ్యవహర్తల సంఖ్యలు |
|---|---|
| 7 | 1,2 |
| 6 | 6,10 |
| 5 | 4,5 |
| 4 | 8,9 |
| 3 | 3,7 |
| 2 | 11,12 |

# 9
# వ్యవహార ఖండికలు

## వ్యవహర్త - 1 : కాలేజ్ లైబ్రేరియన్

కేంద్రం : మహబ్బూబాబాద్. కులం : రెడ్డి వయస్సు : ౪౬ సం॥లు
చదువు : బి. ఏ. వ్యవహారఖండిక : స్వవిషయం.

నా పేరు ... రెడ్డి. మా జన్మస్తలం తట్టుపల్లి. ఇక్కణ్ణించి పద్దెమ్మిల్లుంటుందండి. నాకు అక్షరాభ్యాస మ్మామ్మవూర్లోపల్నే జర్గింది. మూడోతర్గతి వరకూ చాలావర్కూ ప్రైవేటు స్కూల్సులోపల్నే మానాయ్నగారు టీచర్స్ని పాయింట్జేస్తూ టీచర్స్ని పొరుగూర్నించి తీస్కొచ్చి అక్కన్నె ఎడ్జుకేష నిప్పిచ్చిన్రు. బస్తీకెళ్ళేముందు ఇంకా పటిష్టంగా ఉండాలనీ లేకోప్తే బునియా చ్చక్కగా వుండాలనీ ఫండమెంటల్స్ పట్టుబడాలన్చెప్పి మారు మారూ వారు చెప్తుండేది. అదే ప్రకారంగా ఓ ప్రైవేట్టీచర్ని పాయింట్చేయించిండు. అప్పుడుర్దూ మీడియ ముంటుండేది. మూడో తర్గతిలోప్ట మేమ్మబూబాబాద్లో చేర్చబన్నేము. నా వెంట వెంట మా మేనత్త కొడుకు — బావగారు — ... రెడ్డిగారు — తర్వాత మా చిన్తాతగారి కొడుకు నాకు మామగారు — ... రెడ్డిగారు వారి పేరు — మేమ్ముగ్గురం ఒకటే తర్గత్లో చేర్చబడ్డాము. అదుర్దూ మీడియముంటుండె. డిసిప్లిన్మాత్ర మా రోజుల్లో చాలాబాగుంటుండేది. మేముగ్గుర్లోపట సుమారు క్లాస్లోప్ట ఓర్నిగాదని ఓరము పోటీపడ్తూ ఒకాసారి నేన్ఫస్టొస్తే రెండోసారి మా బావగారు ... రెడ్డిగారూ, లేకోప్తే మా మామ గారు ... రెడ్డిగారూ ఫస్టొస్తుండే వారు. ఆ సంవచ్చరం చాలా ఫస్ట్గా గడ్చి పోయింది. క్లాస్లో ఉచ్చాహంగా వుండింటిమి. మర్సట్సంవచ్చరం మబూబాబాల్లోప్ట నివాసానికి ఇబ్బందులు వుండుండె — ఆరోజుల్లోప్ట. సూర్యాపేట్లో ఇంతకంటేగూడా మంచిస్తలమనీ తర్వాతక్కడ సవ్కర్యా లెక్కువున్నందువల్ల మానాయ్న గారిక్కన్నించి మమ్మల్ని తరలించి సూర్యాపేట్లో చేర్పించినారు నాల్గోతర్గత్లో. ఆ తర్వాత వారు మాకు దగ్గరగావుండి చూల్లేనందువల్లా మేమొక పూటకూళ్ల యింట్లో ఉంచబడ్డాము. మా చుట్టుపక్కలుండేట్వంటి మిత్రులు మమ్మల్ని చెడ్డపనికే వుపయోగించినట్టుగ, తర్వాతా సూపర్విజన్ సరైంది లేనందువల్లా చెడుమార్గాల్బట్టేము. అక్కడ సిగ్రెట్లు దాగుడు మొదల్వెట్టి క్లాసెస్కూ సరిగ పోకుండ వుండం — క్లాసెస్లో అటెండెన్సిచ్చి తర్వాత బైటపడి

ఎక్కణ్ణో ఏ చెరువు చుట్టో తర్వా తెక్కణ్ణో గోలీలాడ్తూ బంతులాడ్తూ మళ్లీ సాయింత్ర వరకు నాలుగ్గంటల్వర్కు పూట కూళ్లిల్లు జేర్కొని తినిపడుకునే వారం. మా మిత్రుల్కొంతమంది చిన్న చిన్న వస్తువ్లు దొంగిలించడంలోపల గూడ మమ్మల్ను సహాయం దీస్కున్నారు. ఇంతకంటె మించిన విశయమే మ్టంటే ఆరోజుల్లో కంట్రోలుంటుండేచ్చక్కర్కు. అన్తే ఒకమారు శక్కర్తెచ్కో వాల. తెసీల్దార్గారు అప్పుడు సేంక్శనిం గదార్టి వుంటుండేది. ఉర్దులో చక్కగా రాయగల్గడం మా కలవడిందప్పుడు. అప్లికేషన్స్ కూడా వుర్దూలోపళ్నె రాసి డైరెక్టుగా తసీల్దార్గార్దగ్గరి క్తీసుకోప్యేవాళ్ళము. వారూ సేంక్శన్చేస్నారు. కానీ మెహాత్మా తేసీలన్చెప్పనీ ఒక మొహార్వేస్తుంటారు ఆదప్తేదారూవాల్లు. ఆదప్తే దారున్చూస్తే మాత్రమ్మహా బయంగా వుంటుండేది. నిజాన్కిమాకు డబ్బు గూడ్లేదొక్నాలంటె. అది మరి పక్కవాడ్కెవన్కొ యిచ్చి తర్వాత డబ్బుసేక రించుకోడమో, పాల్లా బేడకో అమ్మకోటం తప్ప ఆ కూపనూ వేరే విదంగ వుపకరించేద్కాదమ్మకు. డబ్బు మాదగ్గుండే దూక్కడా కాదు. సరే యీవిదంగ చాలా కాలం గడ్చింది. ఈలోగా నిజాం గవర్నమెంట్మీద విద్యార్థులూ, తర్వాత వాల్లూ వీల్లూ ఒక అల్లడి తీస్కొచ్చిన్రు, పోలీసేక్శనంటూ ఒకపెద్దగా జర్గిం దప్పుడు. పోలీసేక్శన్గాదండి. తప్పె చెప్తున్నా. ఓటి స్ట్రైగ్గరిగిందక్కడ తరాత పోలీసు ల్లాటీచార్జీ లవ్వి చెయ్యం జర్గింది. ఆ దినం అద్రుష్టవశేత్తు మేము దురాశ్ పల్లి గుట్లని దగ్గర్లోపళ్నె వుండున్నయ్. ఆకాలం సీతాకాలమవ్వంచేతా సీతాపల చెట్లకొర్కని పండ్లకొర్కు మేం బోయింటిమి. అయితె దెబ్బల్మాకు దానివల్ల తప్పినయ్ వాల్లు వసతి గ్రుహాలన్నిగూడా శోదించి తర్వాత పార్టి స్పేజ్చేస్నట్వంటి విద్యార్థు లందర్ని గూడా దెబ్బల్గొట్నారు. మా గ్రామమ్నించీ ... (రెడ్డి) గారి గ్గూడా దెబ్బలు బాగనే తాకినవి. ఆ తర్వాత వారు. ఇంటివద్ద మవ్వాబబా జ్జేర్కున్నరు. ఆకాలం తర్వాత చాల్నాళ్లవర్కా సూక్లెక్కపోలేదివా. ఇదంతా తెల్సింతర్వాత మేం గూడా వూల్లో వుండుంటె మల్లెక్కడ సోదా జేసీ పోలీస్వార్కొడ్తా రన్చెబ్బయంతోటీ మా అమ్మమ్మ గారింటి వైబోయినాం. అయ్నా కొన్రోజ్లర్వాతా తిర్గీ మా సొగ్రామం చేర్కున్నాం. ఇదంతా వినీ మా యొక్క చదువ్ చగ్గా సాగటంలేదనేట్వంటి ద్దెల్సుకుని, తెల్సుకున్న పిదపా, మానాయ్నగారటన్నించి రెండో మారూ మహబూబాద్ద్ స్కొచ్చేర్పించ్నారు. కానీ నాల్గో తర్గతి పాస్తేలేక చదువ్చక్కగా సాక్కా మేం ఫెయ్ల్యవ్వమే జర్గింది. నాల్గో తర్గతి పాస్చేసే ప్రెయ్త్నం మానాయ్నగార్చెయ్యం గూడా తట స్తించింది. తుదకూ రీయెగ్జామినేశన్సలో కండిశ్నల్గ మేం ప్రమోజైయ్యబడ్నాము. ఆ తర్వాతా విద్యార్థుల్లోప్ట మూడో స్రేన్వార్గనె వుండిపోయ్నాము. ఆ ప్రకారంగ మెట్రిక్కులేషన్ పందోందొందలే బైనాల్గ్లోప్ట గూడా మొదట్సార్గా హెచ్చెస్సీ పాస్కలేనట్వంటి పరిస్తితి గూడేర్పడింది. రెండోసారి పందోందలేబయ్యెద్లో యానువల్పరిక్షకి ప్రిపేరయ్ రెండో స్రేన్లో వుత్తీర్నై కాలేజెజుకేషన్కు

హైద్రాబాద్పంపబడ్నాము. సో హయ్యర్సెకండ్రీ ఎడ్జుకేషన్లో ఎక్కువ్గా రానించ కోప్యయ్నప్పటికిని మొత్తమ్మీద గేమ్స్లో కొంత సంబంధం యుండియుండడం వల్ల అందులో రానించగల్గినాను. ఎన్మిదో తర్గ చ్చేరిందొమ్మొదలూ చాలావర్కు గేమ్స్లో పార్టిస్పేట్జేస్తుండేది. హైస్కూల్లో వుండగా ఫుడ్బాల్, వాలీబాల్, బేడ్మింటెన్ కొద్ది గొప్పా ఆడుతుండే వాన్ని. ముఖ్యంగా వాలిబాల్లో డిస్ట్రిక్టు స్కూల్స్ మీటౌతుండేవి — డిస్ట్రిక్టు హెడ్క్వార్టర్స్లోప్ట. నేనొకొక్సారి హైస్కూల్కెరియర్లోపల్నె నేన్పదో తర్గత్లో వుండగా సుబాటోర్నమెంట్స్ అనగా మూడు డిస్ట్రిక్ట్సు యొక్క హాయ్స్కూల్సు హన్మకొండ మల్టీపర్పజ్ గ్రౌండ్లొస ఆడిస్తుండేది. మేమొక్సారి మూడు డిస్ట్రిక్సుగూడా గెల్చుకొన్నాము. అదీ నాకు పెద్ద గర్వకార్నంగా వుంటుండేదప్పుడు. ఆ తర్వాతా కాలేజె జ్కేషన్లో చాదర్ఘాట్కాలేజ్లో ఎడ్మిశన్తీసుకున్నాము. అప్పుడు తల్లిదండ్రులు గానీ లేక్పోతె ఇంకె వరుగానీ చేర్పించేదేన్లేదు. మేమే సొయంగా అప్లికేషన్ ఫ్హామ్స్ గొనుక్కొని అప్లై జేస్నాము. కానీ దురదృష్టవసేత్తూ నిజాం కాలేజ్లో సీట్దొర్కలేదు. సెకండ్ ప్రెఫ్రెన్స్గా పెట్కున్నట్వంటి ఇంటర్మిడెట్ కాలేజీ చాదర్ఘాట్లో నాకా అవ్కాసెం దొర్కింది. చాదర్ఘాట్లో ఇంటర్మీడియట్ టూయర్స్ తప్ప యెజ్కేశన్లో మాత్రం మల్లి రానించలే దెక్కడా. కాని గేమ్స్ సైడ్మాత్రం ఎప్పుడూ రానిస్తుంటూనే వుంటుండేది. అక్కడింటర్కాలేజ్ టోర్నమెంట్స్ లోప్ట గూడ మాదె ఫస్టుంటుండె దానియొక్క మెంబర్గ వుండుంటిని. ఎక్కువ్వాలీబాల్మీనె కన్సెంట్రేశన్ వుండిండే దప్పుడు. అదెట్లాంటే యూనివర్సిటీ లెవెల్లోప్టా సర్వసాదార్నంగా ఏదైనా ఒక్టి కలర్హోల్డర్గావాలంటే ఏదోవొక గేమున్మాత్రం యశేచ్మెంచ్చుట్కుంటుండేది. అయ్తె, చాలావర్కు ఒకటి కంటె మించి రిప్రెజెంట్చేసే వాల్చాలా తక్కువమ్మందున్నారు. కావట్టి ఒకటే వాలీబాల్ను ప్రేక్టీచ్చేస్తే చేస్కుండేది. ఇంటర్వర్సిటీ సెలెక్షన్స్ కూడా ట్రయల్స్ వేసే. కానీ సెలెక్ట్ కాలేదు. మెట్రిక్లేశన్ ఫేలైన్తర్వాతా అసలూ మ నాయ్నగార్చాలా వర్కు “నీకచ్చదువ్రాదూ. మెట్రిక్లేశన్తో మానేసెయ్” అని కూడా అనేవారు. అదీ రెండోసారి ఇంటర్మిడెట్లో ఫైల్యెకావ్టం.అది మరింత బాదా కరంగా వుండిండె. కానీ పట్టువదల్కుండా రెండో సార్గూడా పరిక్షిచ్చా. కానీ దురద్రుష్ట్ పసేత్తు మల్లి తప్పింటి. ఇగమీదట్లా బన్లేదనీ అప్పుడప్పుడే ‘సీవై డీసీ’ ఇంట్రజ్యూస్చెయ్బడింది. ఇంటర్మిడెట్లోప్టా ట్వెంటీ ఫైవ్ సర్సెంటుగన్కా అన్ని సబ్జక్ట్సులో వుండినట్టయితే సీవై డీసీలో చేర్చుకునేవారు. అదే ప్రకారంగ సైప్రైవేట్కాలేజ్వివేక్వర్ధనీ వుండుండె. సీవై డీసీలోప్టా సప్లిమెంట్రీబేచ్లో జేర్నాను నైన్టీన్ఫిఫ్టీసెవెన్లో. నా నివాస మప్పుడూ రెడ్డి ఆస్టల్లో వుంటుండేది. రెడ్డి ఆస్టల్లోప్టా అప్పుడూ రెడ్డీ అస్టలైన్పిచ్చించి గూడా గేమ్స్లో పార్టిసిపేట్జేస్తుండేది. ఆటు వయ్యమ్మారే మెంబర్గాన్ టోర్నమెంట్స్లో పార్టిస్పేట్జేస్నాం. అప్పట్లో యంగ్మన్ రెడ్డీ యసోస్యేశన్ ఉండె. అప్పటిప్లెయర్స్లోప్ట చెప్పుకోదగ్గవారూ...

రెడ్డి—ఆర్టీసీ డిపార్ట్‌మెంట్లో వుండేది. వారితో కల్సి ఆడేట్వంటి అవ్కాశమ్మాకు లభించింది. రెడ్డికూడా స్టేట్రిప్రెజెంట్చేస్నట్వంట్వ్యక్తి. ... రెడ్డీ, ... రెడ్డీ మా ప్రాంతీల్లయే. వాల్ల పక్కలో అడ్డం వల్లా మరింత గేం డెవ్లపయింది. అప్పట్కి నిరాస్చెందలేదు ఇంటర్వ్యార్ట్సీకి సెలెక్ట్ కానందుకు. మొదట్సార్నేనూ ఇంటర్వ్యార్ట్సీకి పంతొన్దలేబయ్యెన్మిది — అప్పుడు వివేకవర్ధినీ కాలేజ్నుండీ సెలెక్టయ్నాను. ఆ టోర్నమెంటు కేర్లాస్టేట్లో అప్పుడేర్పాట్జేసిన్రు. మేమ్మొద్రౌండు ఆల్హైనెస్తో ఆడాల్సిండిండె. మేముపొయ్న తెల్లవారి ఎన్మిద్రోజుల ప్రయాణం తర్వాతా వెంటనే ఆంధ్రాయూన్వర్సిటీతో ఆడ్నాము. కానీ దురద్రుష్టవసేత్తూ మొదటీ రౌండ్లోనే సోదర యూనివర్సిటీ వార్తోటీ డిఫీట్డిన్నం. ఆ తర్వాత దూరప్రాంత మొచ్చినందుగ్గానూ కన్యాకుమారి వరగ్గుడపోయి తిర్గిచేర్కున్నం. వివేకవర్ధనీ కాలేజ్లో మూడ్సంవచ్చరముల్లోప్టా రెండో మార్నేనూ ఇంటర్వ్యార్ట్సీకి సెలెక్ట్ చెయ్‌బడ్డాను. ఈ యూన్వర్సిటీ సెలెక్షన్సనేటివీ ప్రస్సంవచ్చరం జర్గుతుంటయ్. ఒక్సారి జరిగిందనంటే మల్లీ అతడే ఆ వ్యక్తి రెండోసార్పార్టిసిపేట్చేస్తాడనేట్వంట్నమ్మకం గూడ్తక్వ. ఆగేనువుండి వుంటేనేమాత్రం రెండోసారి సెలెక్టొవ్తాడు. ఎప్పట్కప్పుడు ఫ్రెష్గా సెలెక్ట్‌చెయ్తమే ఆ ప్రకారంగా నేను నాల్గుసార్లు సెలెక్ట్ కాబడ్డాను. నాల్గోమారు నన్ను సీనియార్టీ ప్రకారంగా నాక్కేప్టెన్షిప్గూడ ఇచ్చినారు. తే, రెండో సారి పార్టిస్పేశన్లో ... సింగ్ కెప్టెన్గా వుండిండె. ఇప్పుడ్వారా యమ్మిజేసి ప్రేక్టీస్చేస్తున్నారు. రెండోటోర్నమెంటు నాగ్పూర్లోప్టా ఏర్పాట్జేస్నారు. ఆలిండియాఫైనల్స్ గూడా అక్కడే ఉండుండె. ఈటోర్నమెంట్స్కు జోన్స్గా ఏర్పాట్జేస్తుంటరు. ఒకటి దక్షిన జోననీ, ఒకటి ఉత్తర్జోననీ-నార్త్‌జోన్ ఆర్ సౌత్‌జోన్. ఆల్టర్నేటియ్యర్స్లోప్టా ఆలిండియా ఫైనల్స్గన సేత్లో ఉండుంటే మర్సంవచ్చరం ఆలిండియా ఫైనాల్స్ నార్త్‌లో ఉండింటయ్. సౌత్జోను విన్నైనాము. ఆతర్వాత నార్త్జోన్విన్నయ్యేట్వంటి యూన్వర్సిటీ గూడ అక్కడ్కే వొచ్చొంది. నాక్లియ్యర్గా గుర్తులేదు. ఏదోయూన్వర్సిటీ వుండిండె. ఆఁ. పంజాబ్ యూన్వర్సిటీ అండి. పంజాబ్ యూన్వర్సిటీ నార్త్జోన్విన్నై నాగ్పూర్కె జేర్కుంది. మేము సౌత్జోన్విన్నయ్యున్నాము. ఆలిండ్యా ఫైనల్స్ గూడక్కడే జర్గింది. ఆలిండ్యా ఫైనల్స్ గూడా మేము పంజాబ్ టీమ్మీద విన్నయ్ మొదట్సారి వుస్మానియా యూనివర్సిటీకి కీర్తి దక్కించిన వాల్లైనాం. మొదట్సారి ఫస్ట్ రౌండ్లోపట్నే ఓడ్పొయ్నట్వంటి వాలమూ యీసారి సౌత్జోన్లో గెల్చి తర్వాత నార్త్జోన్ ఆలిండియా ఫైనల్స్కు రావడమూ మాకొచాలా సంతోశంగా వుండిండె. అది పట్టరానట్వంటి సంతోశమనొక్కండి. తర్వాత ట్రాఫీమొదట్సారిగా హైద్రాబాదొచ్చింది. అప్పుడూ ... గారు వైస్చేన్స్లర్గా వుండిండ్రి. వారొక్సారి ప్రచ్చేకించి నిజాం కాలేజీ ఆవరన్లోపట్నే మాగ్గాగ్లేండింగ్ఫంక్షన్

పర్వాప్జేసిన్రు. ఆ గాంర్లెండింగ్ఫంన్శన్లోపటా...గారూ మాకు గార్లెండందర్కి జేస్నారు. మాకన్నిట్కంటె ఉన్నతమై నట్వంటి స్తానం లబించ్నట్టుగ బావించినం ఆ దినం. ఇగ తర్డ్ రిప్రెజెంటేశనూ - మళ్లీ సెలెక్టయ్నాన్నేను. ఆప్పుడూ మద్రాస్లోప్టా సౌజ్జోనుండుండె. అప్పుడూ, యీసారికూడా సౌజ్జోన్వినై ఏనార్త్ జోన్లా కానూప్లోప్ట ఆలిండియా ఫైనల్సందుండె. రెంద్రోల ప్రయానాన్నంతరం మేం వెంటనే విక్రమ్యూన్వర్సిటీతోటి ఎదుర్కోవాల్సొచ్చింది. అప్పుడా కాన్పూర్యొక్క వాతావర్నం మాకేమి అంత నచ్చలేదు. కాన్పూర్యొక్క చరిత్రలోపశ్నే యితర దేసెస్తులు క్రికెట్టు ఓడిపోయ్నట్వంటి, టెస్ట్మేచస్గూడ ఓడ్పోయ్నట్వం ట్సంగటన్లుగూడ వుండిన్నయ్. అదే మాక్కూడా ఎద్రైంది. మేమక్కడా ఆలిండియా ఫైనల్సివ్వటం జర్గింది. మాక్సెకండ్ ప్రైజ్లబించింది. ఇక నాల్గోసారి రిప్రెజెంటేషన్. అప్పున్నేన్కాలేజ్లో లేనన్కోండి అయ్నప్పటికి కేప్టెన్సుగా అవ్కాసెం వుందన్నైన్సల్సి కాలేజ్లో వున్నట్టుగా ఒగ సర్టిఫికెట్సంపాదించి యూన్వర్సిటీ రిప్రెజెంట్చేసేను. అప్పుడ్కెప్టెన్సినాకివ్వడం జర్గింది. ఈసారి కటక్లొ, ఒరిస్సాలోప్టా, సౌజ్జోన్ ఆలిండియా ఫైనల్స్కూ ఏర్పాట్జర్గింది. మాకెప్టెన్సోప్ట మేం రెండవ్సారి ఆలిండియా విన్నర్సైనాము. ప్రైజ్డిస్ట్రిబూషన్తర్వాతా మేం రేడ్యోస్టేశన్గూడ వెల్లడన్జర్గింది. అక్కడా చిన్నయింటర్వ్యూ— అంటే గెలుపుకార్నాలేన్టి, మేమేండయిట్తీస్కునే వారము, ఎన్ని గంట్లు ప్రాక్టిస్చేసే వారము — ఇవన్ని క్లుప్తంగా అడిగినారు. వాటిక్సమాదానం యిచ్చేసి, మాప్లేర్స్తోగల్సి ... ఆ తర్వాతా రెండోసారి నాకెప్టెన్స్లోప్టా యూన్వర్సిటీకి పేర్తీసుకొచ్చాను. ఈ ప్రకారంగా అటు ఎజ్జుకేషన్ బీయే వివేక్వర్దిన్లోప్టా పూర్జేస్కున్నా — నైన్టీన్సిక్స్టీసెవన్లోప్ట. ఆతర్వాతా లా కాలేజ్లో అప్లైచేసేను. కానీ అక్కైవ్వే తిర్గిచూల్లేదు. ఈలో ఉజ్జోగాన్వేశన ప్రారంబించిన. గ్రీన్లేడ్స్ పక్కన్నే ఎంప్లాయ్మెంటెక్స్చేంజ్లొ ఎంటర్చేయించ. కాలొచ్చింది. తర్వాతా చీఫింజినీర్, హాయ్వేస్లోప్టా క్లెరికల్పోస్ట్లోప్టా సరిగ్గా అపాయింట్చ్యుయ్యబడ్నా నెల్డీసీగ. కొంతకాలం తర్వాత, అదీ ఆట్లాడీ తర్వాత పాట్ల్ పాడీ యున్నట్వంటి మనస్తత్వం చేత ... అదీ ఎల్డీసీ పదవంటే యేంటో తర్వాతా చిన్న పిల్లల్బల్లో గూచ్చుంటే వీది బల్లోప్టా పంతుల్గారిటుపక్క అట్పక్కచూడకుండా ఎలాబెత్తన్నా అడిచ్చేవారో అదే ఫీలయ్యేది ఆఫీస్లోగూడ. ఆ తర్వాత మూన్నెల్లో రెన్నెల్లి తర్వాతనూ రిజయ్న్చేసి వచ్చేసేను. ఆతర్వాత మరి ఇంటీవద్ద ఒట్టిగుండి గుడ చేసేదేమీ లేకుండె. అప్పడ్వర్కూ మతాతగారూ తర్వాత మానాయ్నగారూ వారంతగుడా వుండిన్నారు. నాకెచ్చెయ్యాల్స నట్వంటి పని గుడేంలేకుండె. మళ్లీ వరంగలొచ్చి ఎంప్లాయ్మెంటెక్స్చేంజ్లొ రిజిస్ట్రేషన్చేయించేసిన. అప్పుడు రెవెన్యూ మినిస్ట్రుగారు శ్రీ ... రెడ్డిగారూ మాప్రాంతీల్లోయుగా వుండింద్రి. వార్నప్రోచ్చెయ్యంగూడ జర్గింది. సరైనట్వంటి వుజ్జోగమేదయ్నా.

యిప్పిస్తా మన్చెప్పిగూడ వార్తామీ యిచ్చిన్రు. ఆయ్తే, దీన్గురించి నే ప్రచ్చేకించ ప్రోచ్చాకలేదు. నాపేర్యాకడా ప్రపోచ్చేయ్బడింది ఎంప్లాయ్మెంటెక్చేంజ్నించి. నే నింటర్వ్యూకి వెళ్లాను. డైరెక్రాఫ్ మార్కెటింగ్ శ్రీ ... గారూ అప్పుడింటర్వ్యూలో వుండిండ్రి. నాతోపాటూ ... (అ) ని గూడ ఉండె. మేమిర్వురం వరంగల్లు క్సెలక్టయ్నాం. ఒకవారం రోలూ ఉస్మాన్గంజ్లో ట్రెయ్నింగ్ తర్వాత నేనూ వరంగ ల్గ్రేడ్మార్కెట్లో పోస్ట్ చెయ్బడ్డాను – గ్రేడింగ్ అస్టెట్ మార్కెటింగ్ సూవర్నెంట్గ. సుమారొకూడ్మిడు సంవచ్చరములు మార్కెటింగ్ సర్వీస్లో వుండిన్నాం. గ్రేడింగ్యొక్క తర్ఫీదు నాగ్పూర్లో పొంది యుండాల్సిండె మూడ్సంవచ్చరముల్తర్వాత కూడా గ్రేడింగు ట్రెయినింకు పంపబల్లేదు. ఆ వుజ్జోగంలోవుంటూ వుంటూ అంత కంటే మించిన వుజ్జోగంలో చేరుటకు ఎల్లప్పుడూ ప్రయత్నిస్తుండేవాన్ని. అదే ప్రకారం పబ్లిక్సర్వీస్కమీషన్ సెలెక్షను క్గూడా కూచున్నం. రెవెన్యూలో చాలా యిష్టముంటుండేది. అప్పుడ్రెవిన్యూ మినిస్ట్రు గార్గూడా మా ప్రాంతీల్లయే గావట్టి వార్సహక్కారం గూడ లభిస్తుందనేట్వంటి ఆస్చాలా వుండిండె, కానీ అదీ చివరకు అడి ఆసే అయింది. ఈలోగా రెండు సాల్మూడుసాల్లు పోలిస్సబిన్స్పెక్టర్గా యింటర్వ్యూస్కపోయి తిర్గి రావడంగూడా జర్గింది. కానీ వార్సహక్కారం సకాలంలో దొర్కలేదు. మొత్తమ్మీద్గా అస్టెంట్మార్కెటింగ్సూపరిండెంట్ – ఆ పోస్టు గూడా పేరు మాత్రం పెద్దగా వుందనుకోండి సూపరింటెండెంటని. జీతమ్మాత్రం నూట పద్రూపాయ ల్స్టార్టింగుంటుండేది. దాన్మీద విముక్తి (?) గల్గింది. చివర్కి దానిక్రి జిగ్నేశన్జేసే. సరే, యీలోగానే, జడ్పీమల్టీ పర్పస్ హైస్కూల్కెహెడ్మాస్టరాల్లో స్టా, ఏదీ సొగ్రామం గాబట్టీ, సొగ్రామంలో వుండేట్వంటవ్కాసెం గూల్లబిస్తుంద న్చెప్పనీ మల్లీ ప్రయత్నం జేసే. అప్పుడ్జిల్లా పర్శ చ్చేయ్ర్మన్గా ... గారుండిండ్రి. వార్నిప్రోచయ్ తర్వాత అపాయింట్మెంటార్డర్తీసుకొని ఇకన్నేను చేరేను జాబ్లో నట్యూనిస్ట్రీస్ ఫ్టయ్ల్లో. అప్పట్నించీ సొగ్రామంలోపచ్చే వుజ్జోగం గాబట్టీ గ్రాజ్యుయేట్ లయ్బ్రేరియన్గానే ఇక్కడప్పన్చేస్తున్నాను. ఇప్పటిక్ ఎన్మిస్సంవచ్చరాల్సర్వీస్నిండింది. మల్టీపర్పజ్ హైస్కూల్ గవర్న్మెంట్ జూన్యర్కాలేజ్గా కన్వర్ట్ చేయ్బడింది. కానిక్కడూకడా మల్లీ ఎద్రయ్యే ప్రస్నేమ్టంటే నేను క్వాలిఫైడ్కాద్. గ్రాజ్యేట్ — ఏదీ లైబ్రేరియన్స్ కోర్స్లో కాబట్టి బీయెడ్జేసి స్కూలస్టెంట్గా చెయ్లన్చెప్పి పోస్ట్గ్రాజ్యేశన్చేసీ జూన్యర్లెక్చరర్గా మారాలనేట్వంటబ్లాశుందున్నది.

# వ్యవహర్త - 2 : జూనియర్ కాలేజ్ లెక్చరర్

కేంద్రం : జనగాం. కులం : బ్రాహ్మణ వయస్సు : 40 సం॥లు

చదువు : యం. ఏ., బీ. ఎడ్., బీ. ఓ. యల్. వ్యవహారఖండిక : స్వవిషయం.

ఇంతింత కాయ్దాల మీదా అపాయింట్మెంటార్డర్లిచ్చేవాలు. అప్పడ్వర్కల్లా నేనూ తెల్గు విశారద పరిక్శలో పేసైన. మొదటి బేచ్లో పేసైనవాన్ని నేను. సారస్వత్పరిశత్ విశార్ద. మంచిస్తాయ్లో నడ్చేదది. చాలా పెద్దెత్తున వాల్లు డిపించార్విశార్ద పరిక్శను. బహుశా ఈనాటి ఎమ్మే స్తాయ్గూడ దాన్తో సమానం కాదేమోననిపిస్తుంది. అది రెండు సంవచ్చరాలకు పూర్తయిందా పరిక్శ. పందొమ్మిదొందల నలబై లో మొదటిసారిగ్గూచున్నాను. అది మొట్టమొదట్చేచనోండి. తర్వాత ఏబై వొక్కటిలో ఉత్తరబాగమయింది. దాంట్లో పేసైనవాల్లం తొమ్మండుగరమే. నూటయాబై మంది మొట్టమొద్ట గూర్చుంటె నల్బైతొమ్మిద్ పేసైన్రు. తర్వాత చివర్కి ఉత్తర్బాగంలో పేసైన వాల్లం తొమ్మండుగురం. ఆ విశారదను యాబై మూడులోనె-అప్పుడ్రాజ ప్రముకులుండె. అయ్తె, రాజ ప్రముగ్గారు, నైజాం నవాబు, ఆ విశారదను హెచ్చస్సీతో సమానముగ అంగీకరించినట్టుగ ఒక ఫర్మానావుంటె అద్పట్టుకోని వార్దగ్గరికొచ్చియిన. అప్పుడజ్జాసి, సరేహా అప్పడ్వర్కూ ఉజ్జోగం కొర్కు అడ్గేవాల్ల సంక్యా విపరీతమై పోయింది. అయిన తర్వాత వారూ హెచ్చెస్సీతో సమానంగదా తీస్కుంటా లెమ్మనెప్పని ఉజ్జోగానికి అంగీకరించిన్రు. దాన్తర్వాత ఇంటర్వూ జర్గింది. రెండు రోజు లింటర్వ్యూలు జర్గింది. అంత మందిండిరప్పుడు. ఆ యాభై మూల్లోనే. కానీ మొత్తమ్మీద మాత్రం అంతా హెచ్చస్సీ పేసైనవాల్లె. హెచ్చెస్సీ పేసైనవాల్లకి అప్పుడూ పయ్ంసట్తా ఏక్ సవ్ పంద్రా గ్రేడి[1] వ్వాల్సుండె. కానీ, ఒక గ్రేడు తక్కగ్గా ఇవ్వడాన్కని వాల్లూ నిర్నయన్జేసుగున్నారట. అయ్నప్పట్కి న్నీ దాంట్ల గ్రేడు మెన్శన్ చెయ్యడం గానీ, ఆర్డర్ల సంపూర్నంగా యివ్వడంగానీ ఏమ్లే. ఓ చిన్న చిన్న కాయ్దాలల్లో వన్సిక్టీన్ త్ందామా లేకోపోతె ఇంకా సగమందామా? ఈ చిన చిన్న కాయ్దాలల్లో పేర్లు రాసి పలానా వూరుకోపొమ్మనెప్పని ఇచ్చారు. ఆఁ, పోస్టింగాడర్స్. అయ్బటోకనీ నేను చక్కగా కమ్మం జిల్లాలో - ఏబైమూల్లో కమ్మంజిల్లా గాదు. కమ్మం వరంగల్జిల్లాకిందనే వుండె. అయ్తె, అక్కడికి టీచర్గా వేశెరు. ఎక్కడంటె- గొల్లంపహాడని. అక్కడి గొచ్చవటాన్కి ముందు మదిర్ల దిగాలె. అక్కన్నించీ వైరా బస్సెక్కి గొల్ల

1) 65-115 గ్రేడు

పూడిలో దిగి గొల్లంపహొడ్కు బోవాలె. అయ్తె ఆ గొల్లంపహొడ్కు - అది మూడ్ మైల్లుంటుంది. నడ్చిపోయ్న. అంతా అడివిప్రదేశంలాగా, అంతా కొత్త కొత్తగా అన్పించింది. అక్కడ వాల్లంతా బహుశా నేనన్కుంటా కమ్మకాపుల్లో యేమో వుంటారు. వాల్లంతా జొన్నలని నానబెట్టి నీల్లలో దంచుకోన్దింటరు. దంచి అది అన్నం వండ్కోన్దింటరు. జొన్నన్నమంటారు వాల్లు. దాన్ని చూసే సరికి నాకు బయమేసింది. కని, ఇంటినించి బోయెటప్పుడు ఎందుకైనా మంచి దని ఒహ మూడ్సేర్ల బియ్యమ్మాత్రం బట్కపోయింటి. ఆ మూడ్సేర్ల బియ్యాన్ని తొమ్మిది రోజులు వొండుకొత్తిన్న. అదీ ఒక కర్నాలింట్లో వుండే వాన్ని. ఆ అత్తా కోడండ్లూ వాల్లకప్డిబడక చెరొదిక్కుగా వొండుకొనేవాల్లు. ఒక పెద్ద వరండా వుండేది వెన్కకు. హోల్లాగా వుండేది. ఓ పక్కకు కోడలొండు కునేది. ఓ పక్కకత్త వొండుకునేది. మద్యన నా పొయ్యి. ఒక చిన్న బొగ్గుల పొయ్యి బెట్కునేవాన్ని. దాన్మీద అన్నం వొండుకునేవాన్ని. అయ్తె, కోడ లింత ఓ కూర ఏదో పచ్చడో పెడ్తే అత్త ఇంత పెర్గోదో తెచ్చిచ్చేది. ఇద్దరు కాంపిటీశన్ బడేవాల్లు - పోటీ బడేవాల్లన్నట్నాకు. అట్లా. సరే మొత్తమ్మీద తొమ్మిద్రోజులక్కడ్గడిపిన. గడిపి,అప్పుడింతలోకే అక్టోబర్సెలవులేవో వచ్చినయ్. మల్లా మా వూర్కొచ్చిన.

మొత్తమ్మీద హెచ్చెస్సీ గ్గూచ్చున్నాననోకండి. కానీ అప్పున్నాకింగ్లీ శైలియదు. ఇంగ్లీశ్ యే బీ సీ డీల్గూడారావు. ఆ ఫస్టుపేపరుత్తదే యిచ్చొస్తుంటే వాల్లు యేమన్కున్నరు? ఇతడేదో బయ్పడి పారిపోతున్నడన్కున్నరు. అప్ప డ్చాల స్ట్రిక్టుగ జర్గేవనోకండి పరిక్సలు. ఏబయ్యొనిమిద్లో,అహం, ఏబయ్యేడులో. ఏబయ్యేడు సప్లిమెంట్రి కేండేట్. ఫస్ట్ పేపరొదిలిపెట్టేశ్—అదే పేర్రాసిచ్చొ చ్చిన. సెకండ్పేపర్కు పోనేలేదు. లెక్కల్పరీక్షకొచ్చెయ్న. కాని లెక్కల్కొంచెం బాగ్నే క్రుశ్చేసుంటి గాని ఆ లెక్కల్లో నేను కొంచం అతి తెలివి చూపించి ఏదో కటినమయ్న లెక్కలు ముందు జెయ్యాలె, సులబమైనవి తర్వాత జెయ్యా లనె పద్దతిలో కటినమైనవి పెట్కోనీ సులబమైనవన్ని...ఇవ్వీ బోయ్నయ్, అవ్వీ బోయ్నయ్. మొత్తమ్మీదా ఆ పేపరట్ల జెడిగొట్న. అప్పుడు మా తమ్ముడు, చిన్నతమ్ముడూ, పాలిటెక్నిక్కులో హెచ్చెస్సీ చదువ్తుండేవాడు. అదీ నేనుండేట్వంటి సెంటరు కెదురుగ్గ యిల్లె. సైన్సు పరీక్ష వొచ్చింది. సైన్సు గూడ నేను జద్వలేదు. కెమిస్ట్రి అంటే యేమిటొ నాకు దెల్వదు. ఫిజిక్సు అంత గంటె దెల్వదు. బయాలజి! అసల్నేను ఆ పరీక్ష ఇవ్వద్దనే అన్కున్న. ఇంగ్లీశూ సైన్సు లొదిలిపెట్టి మిగతా యిచ్చుకోచ్చు. తర్వాతెందుకంటె పేపర్వైజుగిచ్చు కోచ్చుగదా? మావాడూ, 'అన్నా! నువ్వేపరంత పాడుజేస్నవదీయిదీ' అన్చెప్పి గోలపెట్టిండు. ఏం జెయ్మంటవ్రాంటె కొంచం సైన్సన్నా రాశ్రమ్మంటాడు. ఏమ్రా యాల్నేనూ అంటె నేన్కొని యేదో గెస్జెస్త. అద్రాస్తానాడు. అంటె చెప్రా మరీ అన్న. అంటే కెమిస్ట్రిలో మాత్రం నాకేమీ చెప్పొద్దు, ఫిజిక్సులో యేమన్నా అర్దమయ్యేదైతే చెప్పు అన్న. పొద్దటిపూట బయాలజి

వుండేదనోయ్కండి. బయాలజిలో వాడు యేదో కొన్ని గెస్సేస్చెప్పిండండి అయ్న తర్వాత పరీక్ష్కకోయ్న్న. సరీగ్గ నా అద్రుష్టం కొద్దీ ఇవ్వే వొచ్చినయ్యండి. కచ్చితంగ యీ రెండు ప్రశ్నల్రాసిన. ఈ మూడో ప్రస్నెట్లా? ఇపెట్లాన్చెప్తి స్త్రిగ్గెస్తుంటె ఇగ టయ్మయ్తె వున్నదిగద. తెలుగ్మీడియమ్లైనాయ్. తిగ్గేస్తుంటే, విశాజంతువుల గురించీ యేదో వున్నది. జన్రల్గా గొశేశ్న. మా తమ్ముడ్తోన్జెప్పిన. అన్నా! వీటికి - అంటె ఒక్కొక్క ప్రశ్నకి ఎన్మిదేసి మార్కులన్నట్టు - వీటికి మాత్రం తప్పకుండా నీకు మూడైదుల పదిహేను మార్కులొస్తయ్యన్నాడు. ఆఁ, మంచిద్రా అన్నా. ఇంకో పేపరున్నదిగదా. ఇగ దానికెట్లరా అంటి. నేను గెస్సేస్తెజెప్త. ఒస్తె రాస్రా, లేకుంటెలే. నీకు నష్టమేమున్నది? అన్నడు. అంటె, మంచిద్రా అన్న. అనంగనే అప్పుడూ ఆర్కిమెడిస్సిద్ధాంతమని వొక బొమ్మ దింపి జూపిచ్చిండు. చూపిచ్చి అయస్కాంత మదొకట్చెప్పాడు. అది కొంచ మర్థమైంది. సరే మల్లీ పోయినాన్. సరీగ్గా అవే వొచ్చినయ్యండి. అవ్వి రాసేస్న. రొండు. దాంట్లోగూడ అంతె. రొండు రాశ్న మూడో దాన్కొట్లానెదుక్కుంటూ వుంటే ఎక్కడా ఏమీ దొర్కలేవు. కెమిస్ట్రి అసల్కి మనకాసే లేదనోయ్కండి. ఆ ముచ్చటే పట్లేద్దాన్ని. అయ్న తర్వాతా, చూడంగ చూడంగా ఒకటి కాంతి రుజుమార్గమున ప్రసరించునూ అని వొక ప్రశ్న వున్నది. నాకూ చిటుక్కున వొకాయిది గ్నాపకమొచ్చిందండి. ఆ రాత్రిపూట నాతోపాటొక పిల్లవాడూ పరీక్షివ్వటానికొచ్చిండు. ఆయ్న పాపం ఎన్మిసార్లో, తొమ్మిసార్లో యిచ్చిండన్కోండి. ఇచ్చి పాపం ఫేలయిండు. నేను నిద్దరపోతున్న. చటుక్కున మెల్కొవచ్చేసరక్ల్లా మా తమ్ముడు మూడు కారుడ్లు పట్టుకొని వాటికి పొక్కల్జేసి ఎక్కాబుడ్బెట్టి వాడు చూపిస్తున్నడు. అది చటుక్కున గ్నాపకమొచ్చిందండీ. అక్కడ ఒక ఎక్కాబుడ్బెట్టి దింపిన. టయ్మున్నదిగదా —మనకి. మూడు కారడ్లు దింపినా. వాటికి రంధ్రాల్లాగా బెట్టి అసలు కాంతి పడుటాడేదో బొమ్మలాగా జేసినా దాన్ని. చేసి దానికింద యిట్ల యీ ప్రకారంగ యిట్ల రుజుమార్గమున ప్రసరిస్తుంది. లేకోతే దానికడ్డమయ్యేట్టయ్తె ప్రసరించదు. అదీ ఏదో కాస్త కొంచం గేసు రాసిన్నండి. ఒచ్చి చెప్పిన మావాడికి. అయ్తె వాడిజ్జూసి అన్నాడు —అన్నా తప్పకుండ దీంట్లో గూడ పద్హేను మార్కులొస్తయన్నడు. మొత్తమ్మిపయ్ మార్కులు. పాసయ్పోయ్నట్టెగదా సైన్సులో. కాదనుకున్న సైన్స్ పాసయ్పోయ్నట్టు. పోతివా లెక్కలున్నది. ఇహ తక్కినవాట్లల్ల ప్రద్దాంట్లోగూడా అర్వై పైననే మార్కులొచ్చినయ్యనోయ్కండి. తెలుగులో నాకు ఎన్బయ్యొద్దయు మార్కులైంది అప్పుడు- హెచ్చస్సీలో. తర్వాత ఆప్షనల్ సంస్కృతముండె. అట్లా హెచ్చెస్సీ పేసైన.

రచనా వ్యాసంగం విశ్యంలో కాస్త చెప్పాలంటే నేనూ కాంగ్రేస్వాలంటీయర్గ, కాంగ్రేస్వర్కర్గా కొంచెం తిర్గుతూవున్నప్పుడూ దాన్మీద కొంచెం ఆసక్తి కల్గింది. అయ్తె నేనూ చిన్నప్పట్నించికూడా కొంచెం స్వతంత్ర బావాల్కలవాన్ని. ఈ రజాకర్మూమెంటయ్పోయిన్తర్వాత పోలీసేక్షన్తర్వాత

యిక్కడ యేర్పడ్డటువంటి యీ కాంగ్రేసు ప్రభుత్వపు పక్షమేర్పడి రజాకార్లనూ తర్వాత కమ్యూనిస్టులనూ యేర్వేసేట్వంట్పద్ధత్లో మిల్ట్రీ కేంపులెవైతున్నవో ఆ సందర్భాల్లో కూడ నేన్మిల్టీ కేంపులకు శహాయంగ వుంటూ అటు కాంగ్రేస్కమిటీల్లో గూడ తిర్గుతూ వుండేవాన్ని. కొంతగాలం రామానంద తీర్ద గారి వెంట గూడ తిర్గినాను. తర్వాత నేన్మొట్టమొదటి యెలక్షన్ల లో ఎన్నికల కార్యక్రమముల్లో మొత్తమ్మిర్యాల్గూడా తాలూకా, దేవర్కొండ తాలూకా, నల్గొండ తాలూకా ఆ ప్రాంతాల్లో ఎక్కువ తిర్గినా. ఎందుకంటె ఆ జిల్లాప్పుడూ నల్గొండే కాబట్టి. అప్పుడెక్కువ్గా సన్నిహితంగా...గార్తోని వుండేవాన్ని. నాకు చిన్నపున్నించి గూడ బాగా పాటల్పాడడం, నాటకాలు వెయ్యమనేది నాకు బాగా అల్వాటు. నేనూ పద్నాలుగూ పదున్మాదు సంవత్సరాల పిల్వాడుగా వున్నప్పుడు ఒక చిన్న నాటికరాసి 'పరమానందయ్య సిశ్యుల కదలూ' అనేట్వంటి దాన్ని రాసీ, నేనే దాంట్లో పరమానందయ్యగారి గానూ తర్వాత కొందర్నాక్సంబంధించినట్వంటివాల్లు మా తమ్ముడువాల్లు వీల్లతో నాటకం వేసేము. ఆ ప్రకారంగా రచనయందు ఒక రకమైనట్వంటి ఆసక్తి అప్పుడే కొంచం ప్రారంబమైందనవచ్చు. తర్వాత్ యెలక్షన్ల ప్రచారంలో ఎక్కువ్గ నేను ఆసక్తి చూపిస్తూ ఎలక్షన్ల ప్రచారం కొరకు నేనే స్వయముగా గేయాల్ని తయార్జేసి పాడేవాన్ని. అవ్వాట్గా ఆ ప్రజలయొక్క ఆదర్నగూడా పొందేవి. ఇటూ నాయ్కులుగూడా చాలా దీన్ని మెచ్చుకునేవాల్లు. దాన్తర్వాత ఒక రకంగా ఇటు నాకు యీ ప్రేరన కల్గించినట్వంటి వారు...గారనచ్చెప్పవచ్చు. నేను...గారు స్టూడెంటుగా వున్నప్పుడూ వార్రూమ్కు వెల్తుండేవాన్ని. నేనూ వారూ యిద్దరం కల్సి కూచోనీ సాదార్నంగా యీ చర్చల్చేస్తుండేవాల్లం. అప్పుడే నాకస్లు యెమ్మి చేయాలె, నేన్నా జీవ్తంలో చేస్తానా అనేట్వంటొక ఆలోచ్న కల్గింది. అప్పటివర్కు నేను ఏమీలేదు ఒక తెల్గు విశారదతప్ప. అయ్తె,...గారప్పుడు 'నవ్వనిపువ్వు' అనేట్వంటి ఒక గేయనాటిక రాశారు. దాన్నాదారంగా చేస్కోని నేన్గూడా ఒక చిన్న గేయ్నాటిక రాసిన. దాన్తొ వారు నాక్బాగా ప్రోచ్చాహమిచ్చిన్రు. అక్కన్నించీ ఇహాప్పుడప్పుడు నేను గేయాల్రాయ్డం కొన్ని పత్రికలకు పంపించడం, వాట్లల్లో అచ్చుకావ్డం. దాన్తొ నాక్బాగ ప్రోచ్చావం కల్గింది. తర్వాత యీ జన్గామలోకూడా యీ...గారూ 'తెలుగు వెలుగూ' అనెట్వంటి పేర్తొ వొక పత్రిక నడ్పిచ్చేవారు. దానికి నేను వేసాలూ, కొన్ని కదలూ, గేయాలవ్వీ రాస్తుండేవాన్ని. చనిపోయ్నారూ...గారని వారు 'వెలుగు' అనేట్వంటొక పత్రిక నడిపించేవారు. దాన్లో నేను - అది పక్షపత్రిక - ప్రతి సంచికలో నాయొక్కా యేదైనా ఒక్రచన వుంటూవుండేది. ఇగ్దాన్తర్వాత నేను వొక గ్రందరూపంలో రచించినట్వంటి పుస్తకం యేదైనా వున్నదీ అనంటె ఈ తిర్పతి వెంకటేశ్వర్ల మీద—వారు మా యిలవేల్పు—వార్పేర్మీద నేన్స్రీనివాసశతకమూ అన్చెప్పెని ఆటవెలది వృత్తాల్లో రాసిన. అదచ్చుగూడాయింది. అది చాలా వర్కు చాలా మంది దాన్బాగావున్నది అన్చెప్పెని మెచ్చుకున్నరు. దాన్తర్వాత అప్పుడప్పుడు

నేను పజ్జాలే ఎక్కువ్గా రాస్తుంటాను. పజ్జాల్రాయడమంటేనే నాకు చందోబద్ధమైన రచ్న చెయ్యడమంటేనే నాక్చాలా ఆసక్తి. ఎందక్కంటే చందోరహితమయ్నట్వంటి రచన అది శాశ్వతంగా వుంటుందీ అనేట్వంటి విశ్వాసంనాక్లేదు. ఎందక్కంటే అవీ ఏవో భావ కవిత్వాలూ గాలీపాటల్లాగా అవి గాల్కవిత్వాల్లాగా వుండిపోతా యనేట్వంటి విశ్వాసం కలవాన్ని కాబట్టి చందోబద్ధమైనట్వంటి రచన్లే చేస్తూ వుంటాను.

# వ్యవహర్త - 3: రైతు

కేంద్రం: ములుగు. కులం: మున్నూరు కాపు. వయస్సు: 54 సం॥లు
చదువు: 5 వ తరగతి. వ్యవహార ఖండిక: ములుగు ప్రాంతం.

ఈ ప్రాంతం అడవుల్తో నిండీ కొంతకాలం అడవిజంతువుల్తో బాదపడే వాళ్లిక్కడ యీ వెవ్సాయ్దార్లు కొద్ది కాలంనుంచీ యీ అడవు దొలిగ్పోయియీ పంట బూముల్నంచి పంటల్పండేట్వంటిగా మార్పోయ్నయ్. ఇక్కడా రామప్ప, లక్నారం, గనపురం అనే యీ మూడు చెర్లూ యీ తాలూకాలో పెద్దవి. వీటి దగ్గర్దగ్గర్గా వొకొక్కక్క చెర్వెన్కా అయ్దూ పదీ పద్హేను వెల వర్యాక వరి కాస్తూ అయీ యీ మూడిల్లో మంచి పంట పండుతూంది. ఇంత క్పూర్వం యిక్కడడువ్వలున్నప్పుడూ యీ చెర్వులెన్కా యెక్రమొక్కింటికీ నాలు గూమ్డు బస్తాలు పండటం గూడా కశ్టమయ్యేది. అప్పుడడివిజంతులపాలయ్ పొయ్యేది. ఆ రోజుల్లో యీ ప్రాంతంలో అనేక మంది దొంగలు యీవేం తీయులను పీడించి సొమ్ములుదోచుకొని పోయేవాళ్లు అప్పడ్ పబుత్వం యెక్కువ యిక్కడా అంత కంట్రోల్చెయ్య లేనట్వంటి పర్త్సితుల్లో యీ అడివ్ ప్రదేసెం గాబట్టి వారికంతా చొరవ తీస్కునే స్తోమతను కోల్పోయింది. సరే; ఇప్పుడా చిక్కుల్లేవు. ఆ రోజుల్లో వొకొక్కక్క రైతు తమ చేన్లగ్గాపాట్టానికి ఒక యెకరములో రెండూ మూడు మంచెలేస్కొని కాపాడినా యీ పాంతం లుండే పొలాల్ను కాపాడ్కునే సెక్తిలో లేకుండా వుండేవారు. సరే, ఇప్పుడు యీ చెరువ్ల కింద వుండేట్వంటి బూములు యీ నీరు నిరుపయోగం గాకుండా కొన్ని లక్శల పుట్లుబండిస్తున్నరన్చెప్పనంటే సరె ఆనాటికీ నాటిక్జూస్తె చాలా యీ తాలూకా ముందు కొచ్చిందన్చెప్పనే అనుకోవచ్చు. ఇంకో విసేశేందంటే యీ పాంతంలో యీ చెర్వులేకాకుండా మంచిగుట్టలూ, జాలుగల బూములూ, గోదావరీ డెల్టాలకింద పండించ్చేట్వంటి బూములూ చాలా వున్నయ్. ఆ బూముల కింద పొగాకూ, మిర్చి యిటువంటి యింజన్ల ద్వారా, పంపుసెట్ల ద్వారా అనేక పుట్లు పండిచ్చేట్వంటి ఆస్కారాలేర్పడ్డయ్యి. ఇప్పుడుయేటూ ర్నాగారం ఆ ప్రాంతన్లో మిర్చి యిట్వంటి పంట విసేశంగా పండ్తునే వుంది. ఇచ్చాలావర్యాకవిల్వయ్న వస్తువ్గా మనప్రదేసెంలో గుర్తింప బడ్తున్నది. ఇదే కాకుండా యిక్కడా యీ అడవ్లు యెవయ్తున్నయ్యో యీ అడవుల కలుప కొన్నికోట్ల రూపాయ్ల విలువ్గలది యిది చాలా దూరం వర్యాక యిక్కన్నించి పంపించ బడ్తున్నది. దానివల్ల చాలా లాబం కలుగ్తావుంది. అటు పబుత్వాని కిటు పజల మజ్జలో. ఈ కల్ప చాలా వుపయోగపడ్తావుంది. ఈ కల్పయింతా అంతా అనటానిక్వీల్లేనట్వంటి కల్ప యిద్వరకు వెల్లిపోయింది. ఇంకా విసేశంగా

యీ ప్రాంతంలో కల్ప వున్నది. ఈ కల్పకూ తగినంత విల్వావస్తూనే వున్నది ప్రబుత్వానికి. అదేకాకుండా యీ ప్రాంతంలో కొన్ని బొగ్గు గన్లు వుంటయ్యన్చెప్పశేద్గూడా అనోకబడ్తున్నది, పబుత్వం యీ దుష్టి దీసోకనీ, అక్కడక్కడ వున్నాదా లేదానె పరోసిదన్జేయించీ వొకవేల వున్నట్టుగన్కయ్తే ఆ పాంతంలోయీ బొగ్గుదీసేట్వంటి పద్దత్లేర్పాట్జేస్తే యీ పాంతంలుండే కొందర్కి జీవోనిపాది యెక్వకల్గటానికాస్కారముంది. ప్రబుత్వానిగ్గూడా దానివల్ల అనేకలాబాలూ అనేక సవ్కర్యం కలగటానికీ ఆస్కారమున్నట్టూ— యింతకుమ్రందు కొందరింజనీర్లు యీ పాంతంలో బొగ్గున్నది అన్చెప్పన్చెప్తున్నరు. దాన్ని దుష్టియందు పెట్టుకోవాలన్చెప్పనీ దానోకరగు తగుసెద్ద తీసోకవాలన్చెప్పనీ నేను వెక్తిగా వొక మనవ్జేస్తున్నాను. పోతే ఇక్కడా కంక అనే వొకా కుదుర్లు, దీనివల్ల కాకితం యిటువంటి చేసే అందుకు చాలా వుపోగపడే కర్ర వుంది. అంటె 'బొంగు'. ఈ బొంగు నిరుపయోగంగా ఆడవులందె కాలి పోతా వుంది. అది పతియేట దాన్ని పోగుజేసి కొన్ని లక్శల రూపాల్లయు విలువగల బొంగును యే పరిస్రెమకిందనో పెట్టి కాయిదాన్ని తయార్చేస్కున్నట్టయ్తే చాలా బాగుంటుంది. అ దానిపై ప్రబుత్వానికి యే స్రెద్ధా లేనట్టు నావెక్తి చూపులో కన్పడ్తావుంది. దీన్ని సెద్ద తీసోకవాలనీ నేను పబుత్వానికి ఒకా జాడ తెల్పినా వాన్నిగా చెప్కంటున్న. మరోటి. లక్నారం చెరువ్కిందా దాదాపు పన్నెండువేల యెకరాలు పారేట్వంటి సవ్కర్యంగల ఆ చెరువ్కా కాలవ్ల మరమ్మత్తులేని కారణంగా ఆ నీరు వ్రుదాగా దెయ్యమ్మడుగనె వాగులో వడింది. అది తప్పకుండా యే గోదావరో చేర్తునే వుంది. దానివల్ల యే ప్రయోజన్లేకుండా పోతావుంది, ఆ కాలవను దురుస్చెయ్టానికి పబుత్వం యింత వరకు యెందుకాలోచిస్తున్నదో? ఈ పాంతపు రైతులు చాలా బాదపడ్తూనే వున్నరు ఒకసారి దీనిక్తగిన సర్కారీ పెద్ద వుజ్జోగులు చూచి అవ్సరమున్కన్నట్వంటి చెర్య తీసోకనీ ఆ కాలవన్దురుస్చెయిచ్చినట్టయ్తే, యిప్పుడ్పద్వెల్క్రాలు వారేవి అత్తప్పకుండా యిర్వయ్ వేలెక్రాలు పారేట్వంటి సదుపాయ మేర్పడ్తుంది. దానివల్ల తిండిగింజలు పండించుటానికి కొదన్లేకుండా పండించే యేర్పాట్జరుగ్తది. ప్రబుత్వం దీన్పయ్న స్రెద్ద తీసోకవాలనీ మరో కోరిక. మాదే కాకుండా యిక్కడి ప్రాంతప్పజలందరూ ఆ కోరికలో వున్నరు, సరే, ఇంకో విశయమేటంటే— యీ ప్రాంతంలో యిప్పుడు యెక్కువ దాన్యం పండుతుందనీ, యీ దాన్య మిక్కన్నుంచి యెగుమచ్చెయ్టానికీ యేర్పాటయ్నట్వంటి వొకాలారీ సప్లయ్గాని. యిట్వంటి సప్లయ్యయ్తె వరంగల్దిస్కవొయ్యక్కడమేం జీప్లా పెద్తున్నం. ఆ జీప్ యిక్కనన్ంచక్కడ్దన్క వెల్లేట్వంటి కర్చులూ యిట్వంటియీ రయ్తుల్మీద్వడకుండా యిక్కడా ఇల్వయ్ మిశిన్లు వొటి రెండుబెడ్తే—యెంద్గంటే యిక్కడ్దాన్య మెక్కువ్పండు తున్నద్గావట్టి— అ మిశిన్లు గాన కిక్కడ్పెట్టినట్టయ్తె—అంటే రయిస్మిల్స్—ఇక్కన్నె బియ్యాన్తయారయ్యా మా రయ్తుల కుపయోగపడ్తుంది. ప్రబుత్వాని గూడా యిక్కన్నుంచె

క్కడోక్క తీస్కపోయ్ పత్యేక వయ్స్ని పర్తిస్తల్లేకుండా వుంటుందీ అని ఒకకోరిక. రెండోది- యీ పాంతంలో యెక్కువ పత్తి పంట పండుతావుంది. ఈ పత్తి పంటనూ పోగుచేసి త్తర్వాతా యీ పత్తిని యెక్కడోక్క యెగుమజ్జేసేదాని కన్నా యిక్కన్నే గింజ తీసేట్వంటీ పరిస్రెమ గన్కేర్పడ్తే యీ పాంతీయు లకూ కొంతపని దొర్కటమే కాకుండా యీ పాంతంలో దొర్కినట్వంటి పత్తీ యిక్కన్నే సుబ్రమయ్యీ ఆలికగా యితర ప్రదేసేలకు యెల్లిపోవటాని కాస్కార ముంటుంది. అదొక్కళ్చేస్తె బాగుంటుందేమోన్చెప్పనీ అనోక్క బడ్తున్నది. ఇంకోటేంటంటే- యీ ప్రాంతంలో యెక్కువ్మంది చిన్న పట్టే దార్లున్నరు. కొంత మంది పెద్ద పట్టేదార్లు-అంటే—కొందరికి పద్వేల యెక్రాల వరగ్గూడా యిక్కడ బూమి వున్నది. ఆ బూమి నిరుపయోగంగ ఒడిన్నది. ప్రబుత్వం ఆ బూమిని తమ స్వాదీనం జేస్కోనీ అవ్సరమయ్న చెర్య కింద బెట్ట డమో యా లేకబోతే ఆ పట్టేదార్తో కాస్టు చేయించటమో జరగకుండా అట్లు పడిన్నంతలోపటా యీ రోజుల్లో జీవోన్నపాది లేదని మొత్కునె రోజుల్లో పజలు అట్ల నిరుపోయ్గంగా పడింటం మంచిద్గాదేమో! దానికి యేదయ్నా సదుపా యాన్కి వాడి, వాట్ని కాస్ట్కింద తీస్కుంటమయ్నా యా లేకోపోతే దానికిం కేమయ్నా కారణంచేత వట్టిగ పడుంటకుంట చెయ్టం మంచిదీ అని అన్పిస్తు న్నది మూడోదేంటంటే - యీ ప్రాంతంలో బూరుగా యిట్వంటి వృక్శాలు విసేశంగ వున్నయ్. కాబట్టి యిక్కడ అగ్గిపుల్లల కస్సంబందించినట్వంటి వొక కార్కానా యిటువంటియ్ బెట్టిన్నట్టయితె యిక్కడ అగ్గిపుల్లలు తయారవ్తే యిక్కడనే యీ ప్రజలకు, యీ ప్రాంత ప్ప్రజలకు నవ్క ర్దొర్కుతుందీ, జీతాల్దొ రుక్తయ్. వనిగుడ దగరయ్తుంది. కల్ప దగ్గ ర్దొరుక్తుంది, ఈ దుస్టిన్చెటోక్కనీ యిక్కడా పరిస్రెమలే దయ్నా తీస్తె బాగుంటుందేమో? ఎందుకంటే కర్ర దగ్గరున్నకాడ దీస్తేనే బాగుంటుంద్గదా? కర్రెక్కడోన్న తీస్క పోయ్ చేయించితే పలితముకన్నా యిక్కడ్దీస్తేనే పలిత మెక్కువుంటుంది అని నేను వుద్దేసెపడ్తూ మరొకసారీ— ఈ మాటనే యిదివర్కెనోన్నసార్లు ప్రబుత్వాని క్చెప్పిన. ఈసారిగూడ యీనాడు చెప్పాలన్చెప్పని చెప్తున్న. పోతె, యింకో టేంటంటె— యీ ప్రాంతమ్లొ కుత్తడి, గుంతలు, లోయలు, వాగులు యియ్ విసేశంగ వున్నయ్. ఇంకా ప్రబుత్వం అనకుంటె యీ లొయ్యలూ వాగులకు అడ్డుకట్టు కట్టినట్టయ్తే యీ అడ్డుకట్టవల్ల యింకా కొన్ని లక్ష ఎక్రాలు వారే ట్వంటి సదుపాయా లిక్కడేర్పడ్తయ్. అంటే, గోదావరీ- యీ నది యిక్క డ్దాదాపు కొన్ని వందల మయ్ల్లు యీ తాలూకాలో నడుస్తున్నది. మరి యీ గోదావరికి- అదే- ఆనకట్ట కడ్తే పారేట్వంటి సవ్కర్యా లున్నయ్. అదొకవేల ప్రబుత్వం దృస్టియందు తీసుకున్నట్టయ్తే వొకచోట గాకోపోయ్నా మరొకచో ట్నెక్కడయ్నా యీ తాలూకాలో కడ్తే గుర్తు చేస్కోనీ,దానికివ్వాల్గాకోపోయ్నా కొంత కాలానికయ్నా ఆ సదుపాయం కలగజేస్తే యీ ప్రాంతం పూర్తిగా పయ్ర్పచ్చల్తో నిండిపోతుందన్చెప్పనేసె గూడావుంది. ఇంకొకటేంటంటే-యీ

తాలూకాలో అడువుల్జెయ్యట్టి తగినన్ని రఅర్లు లేవు. ఏటూర్నాగారం తర్వాత మనం తూర్పు గోదావరి జిల కొవ్వటానిగ్గాను యిట్నుంచి మనకు త్రోవేలేదు. కాబట్టి గోదావరిపయ్ని యేదో పంతెనయ్నా, యా లేకపోతే, యింకేదయ్నా సద్పయాల్లగ్గజేసి యి బస్సూటు అవలిదక్కా యేస్తే యిటిక్కన్నుంచే విజయ్వాడా బద్రాచలం పయ్నుంచి తూర్పుగోదావరిలకు బోయే దాన్కన్నా యిట్నుంచి దగ్గరగ్గరా యే నాల్బయ్యాబయ్ వయ్ల్లతోనే తూర్పుగోదావర్జిల్లా చేర్కునే అవాకాసెం వుంది. అట్ల లేకపోయితే కొన్ని వందల మయ్ల్లు దిర్గీ తూర్పు గోదావర్జిల్లకు పోవల్సివస్తునది. అయ్తె, యీ తాలూకాకు యిదవసరమని గుర్తించాలన్చెప్పెనీకోర్టం జరుగ్తా వుంది, ఇంకో విసయ్మేంటంటే, యీ పాంతంలో వేసె రోడ్లెవయ్తున్నయి మలుగునుంచి కిందికి యేటూర్నాగారం వరగ్గల రాయి, మెత్తటిరాయ్. దీనివల్ల పలుగు లేస్తైమయ్తున్నదంటె- ప్రతి యేట చ్చెడ్పోయి ఆ సరకులూ బస్నడ్చటాన్కి, బన్లు నడ్చుటాన్కి అవస్తయ్ పోయింది. కాబట్టి దాన్నికన్నుంచక్కడన్నా వొక్సారి ప్రబుత్వం కస్టపడి తారోడ్గానీ, సిమెంట్రోడ్గానీ వేస్తే పతియేటా అయ్యే కర్చు మిగిల్పొయ్యి ప్రజల్కు సవ్కర్యంగా వుంటుందేమో అని అపుడప్పుడూ నేనన్కుంటున్న. సరే, ప్రబుత్వానికెన్ని బాదలున్నయ్యో అచ్చెప్పలేనుగాని యిక్కడున్న విశ్యాలు మాత్రం పేమిట్టజేత్తె బాగుంటుందేమోని కొందర్పెద్దల్తో జెప్తున్నా. ఇప్పుడ్మల్లొక్సారి యీ మూలంగ తమకు తెలిజెయ్యాలన్చెప్పనన్కుంటున్న. ఇప్పుడు యీ పాంతం యిప్పుడివరకు వృద్ధి జెందలేదని గాదు. దాదాపు వంద సంవచ్చరాల్కిందట 'మొలుగు' అనె గ్రామంలో యిర్వయ్ రెండు యిన్లతో వున్నట్వంటి వూరు. ఇవ్వాల, ఇదే గ్రామం పదిహేను వందల యిన్లతో- వందసంవచ్చరాలకు యిప్పటి వరకూ అయ్న వుద్దిది. ఇంకా యిక్కడ వృద్ధి గావటానికి అనేక ఆవాకాసే లున్నయ్. ఇప్పుడి తాలూకాలో వుండేట్వంటి వుల్లు చాలా చిన్న వుల్లూ, కొన్ని బేచిరాగుల్లు. బేచిరాగంటె దీపంలేనట్వంటి వుల్లు. సుమారి రెండు వందల యాబయ్, మూడు వందలూగల పేర్లతో వుండినట్వంటి గామాలు గల యీ తాలూకా యీనాడు జనసంకె గలట్వంటి వుల్లు దాదాపు వందకు వందా యాబయ్కు మించి లేవు. మిగతయన్ని బేచిరాగుల్లు.ఈ బేచిరాగుల్లు మొలుగు నుంచి కిందికి అంటె యేటూర్నాగారం వయ్పు వేగులపాడు, మెట్టుపాడు అని యిట్వంటి పాల్లతో నిండినట్వంటియున్న వూల్లూ కొన్ని వందలు. ఆ పదేసేన్ని పబుత్వం అబాదుజెయ్యటాన్కి యేదోలా కార్నం తీస్కోని- అంటే యేదయ్న కార్నమంటే- ఆబాదీ చెయ్టాన్కి అక్కడ్చెరువ్లూ కుంటలేత్తె మనుశుల్పొంయ్ని వ్సించటాన్కి వూర్గావటాన్కి కారనమయ్ంది. అయ్తింకోటేముందంటే- యీ ప్రాంతంలో చాలా బూబాగాన్ని పారెస్టువారు తమ కిందుంచుకున్నారు. అయ్తే, యిక్కడా పంటల్పండే బూమ్లూ వీట్ని ప్రబుత్వం ఆబాద జేయాలన్చెప్పనంటె అది పారెస్టు కింది కున్నది అంటరు. పెద్ద పారెస్ట్నె ప్రబుత్తం వార్దిస్కోనీ మరి సాగుకిందికి తీసుక్రావల్సిందని, సాగుకు లాయిక్కైనట్వంటి గుట్టల పదేసెల్నూ,

బంళా మిట్టల్ప్రదేసేలు అవీ దర్యాప్త్కింద బెడ్తే చాల మంచిదీ అని, పంటబూము లట్వంట్వాట్ని కొన్నిట్ని దీసి యేజన్సీలకిస్తె బాగుంటుందేమో అనే వుద్దేసెం చాలా మంది ప్రజల్లో వుంది. ఈ పకారంగా కొన్ని యిక్కడ అబివ్రుద్ది జెయ్యా ల్సినట్వంటి పన్లు ప్రబుత్వానికి చాలా అవసరం. అదియెక్వ స్రెద్దతీస్కోవాలన్చెప్పెని కోర్టం అయ్తావుంది. అయ్నా ప్రబుత్వుజ్జోగులు వత్తున్నరు, చూత్తున్నరు. చెయ్యాల్యలంటరు. చెయ్టానిగ్గూడ తగినంత స్తోమతా, డబ్బు అవసరం. మరందు వల్ల పబుత్తం యెనకాడుతున్నదీ అన్చెప్పెని అనోక్కవోచ్చు. తప్పదు. అయ్నా ఆ ప్రసెద్దను వొద్లకుండా యింకా కొంతగాలంవరకూ అప్రసెద్దతోనె వుంటె యింకా యిక్కడాచ్చాలా అబ్రుద్దిచేసేట్వంటి అవ్సరం వుంది. కాబట్టి తప్పకుండా మీరు సుస్తావుండాలన్చెప్పెనీ కోరిక.

## వ్యవహర్త - 4 : బేంకు ఉద్యోగి

కేంద్రం : పర్కాల          కులం : హరిజన్.          వయస్సు : 22 సం॥లు

చదువు : హెచ్. యస్. సి.   వ్యవహార ఖండిక : స్వవిషయం-వినోదయాత్ర

మాది పర్కాలకు పద్వ్రెండ్మైను మయిల్ల దూరన్లో వున్న మయ్సంపల్లి గ్రామం. మాది మచ్చతరగత్కుటుంబం. మా నాయ్నగారు వెవ్సాయమ్మీద్దా డార్పడుఃదేవారు. అందులో మా నాయ్నకేదో నన్ను చదివించాల్నని వొక బుద్ధిపుట్టి మాగ్రామంలో వున్న ప్రయ్‌వేట్స్కూలుకంపించ్నారు. అక్కడ్పదు వ్పూర్తిచేసిన తర్వాత తిరిగీ గ్రామంలో హాయ్‌స్కూల్లేనందున పక్కగ్రామంలో-సిర్సిల్ల పేటనే గ్రామంలో-హాయ్‌స్కూలుంటె అక్కడ పంపించ్నారు అక్కడ్పం పిచ్చినాగానీ నాకేదో కొద్దిపాటి వెవ్సాయం వున్నద్దాబట్టీ మా నాయ్న వెవ్సా యన్జేసేవాడే గాబట్టీ ఆ వెవ్సాయన్లో నేనేదో కొద్దిగాయన్కు సహాయ్పడ్తూ అట్చదువ్కొంటూ అదెట్ల చేసేను. ఏదో హాయ్‌స్కూలులో స్టడీస్కొచ్చేవరకి మా ఫాద ర్కొంచ ముసల్వాడు కావడం, ఆ తర్వాత నేను కొంచెం పజ్బార్గావడం అటువంటిదీ మా ఫాదరూ కాలేజీ స్టడీ స్చదివించాలని వుద్దేసెం వున్నాగనీ అక్కడ్కె స్టాప్జేసీ వేరేదన్నా వుజ్జోగ న్జూడాలనీ సేయింత్లేమో నన్నా ప్రోచ్చ హించడం నేను వరంగల్లో ఎంప్లాయ్మెంట్ ఎక్చేంజిలో నా పేరు రిజిస్ట్రేశన్చే యించుకోవడం ఆ తర్వాతా నాకుజ్జోగ న్దొరకడం అదీ జర్గింది. కానీ మొదట్నుంచీ నన్నెన్తో ప్రేమగా పెంచినట్వంటి నా తల్లి నేన్చదువుక్కన ప్డెంతో అత్తృపడి నన్నా చదివించింది. నా చదువుకూ్కడాముక్కె కారకురాలా మేన్చెప్పేసీ...అటు వంటి దీవుజ్జోగం దొర్కిన కొద్ది రోజులకే అంటే యేదో అయిదో ఆరు నెలలకి ఆమె ఒక వేదితొ బాధపడ్తు మరనించింది. ఆమె మరనంతో నా జీవితమ్లొ మార్పు జరిగిందన్చెప్పేసీ...నే నిజంగ నామెనెంతో బాగుజెయాలని ఆమె బాదల్నెంతో సాయంగ జూడాల్ననీ అనేకుద్దేసేలుండేవి. సంవచ్చరం పొడుగూన ఆమె కస్టపడుతూంటే ఆమె కస్టన్చూల్లేక అప్పటికే నాకేవేవో పనుజేసీ ఆమెకు సహాయ్పడాలన్పిచ్చేది. కానీ అంత చిన్న వయస్సులో ఆమెకే సహాయం చెయ్య లేకపోయ్నాను. చదూకున్న తరాతేదో వుజ్జోగం దొరికిందిగదా వార్బాగోగులు చూస్తామ నెంత ప్రయత్నించినా గానీ లాబన్లెకుంటా వొక వేత్తో ఆమె మర్నించ టన్జరిగింది. ఆ మరనంతోని నాకెంతో విచారం కలిగింది. బాగా ఆమె యింత కస్టపడి నన్ను చదివిచ్చింద్గావట్టి ఆమె వెల్పరేమి చూడలేకపోయానే అని బాద కలిగింది. అయ్నా యేన్చేస్తం? ఉజ్జోగన్దొరికింది. అందులో స్టేంట్బేంకాఫ్‌హయ్‌ద్రాబాద్లొ వుజ్జోగం దొర్కింది. మొదట్లో బేంకు వుజ్జోగంటే ఏదో పెద్దగ సంతోశ పడ్డాము. సరేగ, నాలుగ్పయ్సల్జంపాయింస్తె నా బాగోగులేకాకుండా అమ్మా

నాయ్నా వాల్ల బాగోగులిట్ట చూడొచ్చుననీ—కానీ బేంకులోకొచ్చిన సంవత్సరన్లో పల నా తల్లీ దాన్వెల్పేర్జూడంగ దాన్మందులకంటె దాన్వారకర్చు బెట్టడం అది జరిగింది. ఆ తర్వాతా వుజ్జోగంలోంటే బేంకులో క్రాంగనే నెలకూమ్డొందలేదో దొర్కుతియ్యనుక్కున్నాను. కాబట్టి ఆ కాసేన్నంటుకున్న దరలున్జూడబోతే యీ వుజ్జొగంలో ఏమ్సంపాయించలేననే చెప్పొచ్చు నేయంగా. మానాయ్న వద్ద మాకు అయ్దూరెకరాల బూములలో వున్న దాన్ని నేనూ మా తమ్ముడూ వాల్లనూ సాగుడమేకాకుండా ఆయ్న ప్రయోజనంతోనీ డబ్బుల్సంపాయించడం నలుగుల్లో మంచిగ బత్కడమే జర్గింది. కానీ యిన్నాల్లయ్తె బేంకులో వుజ్జోగమన్చెప్పొక్కడమేతప్పా చేతులో నాలుగ్పయ్సల్లేవు ప్రద్దీ జూడబోతే దరలు. పోనీ ఆ వొచ్చిన జీతంతోనయ్నా నేను గడపుదామంటే అది నడిచేట్టులేదు. అటువంట్పరిస్తితులున్నయ్. కాని మొదట్లో బేంకు వుజ్జోగంలో నేనెంతయ్తె వుండాలనుక్కున్ననో అంతగ వుండలేకపోతున్నాను. అటువంటి పరిస్తితు లొచ్చినయ్. వుజ్జోగంలో ఏమీ సంపాయించలేదు. నిజంగా నేను నావూర్లోనయ్నా వెవ్సాయన్జేసుక్కున్నా యీపాటికెందుకో బాగుండెదన్పిస్తున్నది.

బేంకులో కొచ్చిన్తర్వాతా బేంకులో మిగతా వుజ్జోగుల్గుడ నాకెంతో మర్యాదివ్వడం అట్వంటివ్మాత్రం బేంక్లో చూస్తూవున్న. చాలామంది నాతోనీ కోఆపరేశన్ (గ)వుండడమూ అట్వంటి జ్జరుగుతూవుంది. అందరన్గల్సి ఒక్క తీర్గ అంటే మాక్సెలవున్న రోజులలో అక్కడి క్పిక్నికెల్డం, వేరే విసేస్ప్రోగ్రామేస్కుని పోవడము జరుగ్తుంది. అలాగే ఒక రోజు మాకొలీగయ్నట్వంటి శ్రీ... గారితో రామప్పకని వెల్లేనూ. ఒకరోజు ఉదయం ఏడున్నరకే వెల్దామనని ప్రోగ్రాం వేసుకున్నాము. కానీ తీరా బస్టాండొచ్చేవర్కి ఏడున్నరకున్న బస్సు ఏడింటికే పోయిందని మాకు తెలిసింది. అప్పుడామ్కూ చాలా కస్టమే అయింది. ఆ బస్టాండ్లో దాదాపోగంటా గంటన్నర వెయ్ట్ జెయ్యాల్సొచ్చింది. సరే, వొచ్చిన్తరవాతేదో బస్సొస్తె దాంటో వెల్లేమూ. పోతూ పోతూ ఒక్రెడు...గార్గూడా కొన్ని పల్హారాలూ అవ్వీవివ్వీ దీస్కొచ్చారు. సరె, పోయిన్తర్వాతా అక్కడా పదీ పదోక్కండా ప్రాంతంలో రామప్ప చెరువు గట్టెంబడి పక్కనకూచ్చోని ఆ పలారం టిఫినూ ఆర్చేసుక్కునీ తర్వాతా దేవాలయమ్చూస్తామని పోయ్నాము. నిజంగా అక్కడి సిల్పాలన్ని చూస్తే మాకాచ్చెర్రెం వేసింది. మనా ఈ ప్రాంతంలో అట్వంటి సిల్పం అదీది వున్నదని దగ్గర్లో వున్నాగనీ నే నెన్నో సార్లు చూసేను కనీ దాన్లో యింత విసిస్టత వుందని మాత్రం గ్రహించలేదు. అంతడి సిల్పమూ టే వున్న అక్కడా ఏమీ లేదు. మేం పోంగనే, సరే, మేమూ గడియేసి వుండిం... అక్కడొక్సయ్ అటీటూచూస్తుంటేదాన్లోని విసిస్టతనేదీ మాకు దెలిసిందప్పుడె. సరె, దేవాలయం యిప్పుడూ బాగా పిట్టలన్ని అవ్వీయివీ కూచ్చునేంత స్తితికొచ్చింది. దాన్నేమంత బాగచేస్తలేరు. ఇంత సిల్పం అదీ వున్నట్వంటి దేవాలయంలో దేవాలయసేకవారుగానీ వేరే సేకవారుగానీ ఎందుక్సాం డోవ జ్జేస్తోరు? చేసొక్కనీ

అక్కడా పతిదీ సుబ్రమునకు సుబ్రంగా వొచ్చిన యాత్రికుల కట్వొంటి వారి గ్గయిడెన్సు యివ్వటానికి అట్వొంటి యేర్పాట్లు చెయ్యలేదు, ఒక ప్ల్యాన్నోనూ ఏమి టయా యిట్ల వున్నద నడిగ్తే "దీని కేమాదాయం లేస్సార్.ఎవరురారు. వొచ్చినా గానీ అట్ల పయ్యెయ్న్న చూస్పోతరు. వేరే ఎవ్రయ్న్న గవర్మెంటుజ్జోగ్గానీ లేపోతే అఫీశియల్స్ గాని యెవరొచ్చీ దీన్ని దుస్ట్లా వుంచోకనీ యిట్వొంటి మన సిల్ప వయ్భవమిక్కడున్నదనీ వాల్లు గ్రహించరు.ఏం సహాయం చెయ్యరు" అనతడ్చెప్పేడు. ఆ తర్వాతా రామప్ప చెరువ్వూచ్డాని కోప్పయాము.అక్కడా అప్పుడూ జాలర్లు వలలు వేస్కుంటూ చేప ల్పడ్తున్నరు, అప్పడ్కి మేం బోయినప్పుడు కొద్ది నీల్లే వున్నాగాని అచ్చూట్టాని కెంతో మనోహరంగా వుంది. దాన్పక్కనే చెట్లూ అవీవీ ఆ ద్రుస్స్యాలు చాలా బాగన్పించిన య్మాకు.ఆ తర్వాతా అక్కడ కొన్ని పొలాలలో కొంద ర్రయ్తు ల్పన్చేస్తున్నరు. ఆ రయ్తుల్న చూస్తుంటే ఆ పొలాలూ ఆ పచ్చదనమూ అదెంత మాకెంతో హాయన్పించింది. అవన్ని చూసోక్కనీ తరాత్తా రామప్పా బస్టాండ్కొచ్చేవరికి కర్మకాలి మా బస్సు మిస్సయ్ంది. ఇహ మావస్త చెప్పాలక్కడ.ఏన్చేస్తాం? వేరే బస్సులేదు. వేరే బస్సులో రావాల్నంటె ములుగ్పోయ్.ములుగ్నుండీ యిక్కడ గుడెప్పాడనని అక్కడికొచ్చి అక్కన్నుండి తిర్గి రావాలె. అటువంటిది తిరిగిరావాల్నంటె నష్టయ్తుంది. గుడెపాడుకొచ్చేవరకు పర్కాలకొచ్చే బస్సు లేకపోవొచ్చు. అందుకని వెయ్ట్జేసీ కొంచెం గూచోప్పనీ అక్కడవున్న వాల్లనీ వేరే వాల్ల నడిగాను. ఏమయా!యిప్పుడేమన్న బస్సుందాని. వాల్చెప్పేసేరు యిప్పుడేం బస్సులేదని. ఇప్పుడేంచేస్తామ్మరి? ఒకా ఎన్మి దిక్లోమీటర్ల క్కన్నుండి నడోస్కన్ వొచ్చాం. అయ్నా మాకెంతో బాగన్పించింది. ఆ రోడ్డుమీద పయ్నుండొస్తుంటే యీ రెండు పక్కల్న చెట్లూ అవీవీ చాలా మంచి గన్పిచ్నయ్. అంద్లో అద్ సాయంకాలంపూట గావట్టి చాల మంచిగన్పించ్నయ్. అక్కన్నుండి గన్పూరొచ్చేసర్కి అక్కడో బస్సుంది పర్కాల కొచ్చేది. పో యా బస్సులో గూచ్చున్నం. బస్సులో గూచ్చున్న తర్త ఆ కండక్టర్జెప్పేడూ యిద్గంట తర్వాత బోతదని. సరే, ఏదో కర్మగాలి ఆ గంట సేపు ఆ బస్సులోనె వెయ్ట్జేసి చివరికిప్పర్కాల కొచ్చేసర్కి దాదాపూ ఏడు యెన్మిద్గంట లయ్యింది రాత్రి.

# వ్యవహర్త- 5: హాస్టల్ వార్డెన్

కేంద్రం : చేర్యాల   కులం : మున్నూరుకాపు   వయస్సు : 40 స॥లు
చదువు : 9వ తరగతి.  వ్యవహార ఖండిక : వసతిగృహ నిర్వహణం, స్వవిషయం.

నేను ప్రబుత్వపు వసతి గ్రుఅములో పందొమ్మిది వందలా డెబ్బయ్యొకటి జనవరీనుండీ పన్చేస్తున్న. అయ్తె, ప్రబుత్వం యీ వసతి గ్రుహాముల నేర్పాట్చేయ్యడమనేది చాల బాగనే వుంది. చాలావరకూ యిది విద్యార్థులకు లాబకరమయ్యేట్వంటి విశయ్మే. దానివల్ల చాలమంది బాగుపడ్డరూ అనేట్వంటి ఆయే వుద్దేసెం ప్రబుత్వముది అది సపలంగూడా అయ్తుంది. కానీ హరిజనా హాస్టల్స్ గాబట్టి హరిజన వార్డెన్లనే నియ్మించితే హరిజన్లు బాగుపడ్తరనే వుద్దేసెం ప్రబుత్వానికి ఒకటుంది. కాని చాలామంది హరిజన వార్డెన్లు వాండ్లనేం బాగుచెయ్యడమయ్తె లేదు. ఇతర కేస్ట్ వాండ్లెంతనయ్తె బాగుజెయ్య గల్గుతరో అది వాండ్లు ఆ విదంగా చేయ్కుండా నియ్మాలకు విరుద్దంగా నడ్వడంవల్లా పిల్లల్గూడా అదే పద్దత్లో పాత పద్దత్లోనే వస్తున్నట్టుగ నాయొక్క అనుబవమ్లా కల్గింది.

పొద్దున్నే లేవంగానే మాబోర్డర్సు పార్దన్జేస్తరు. ఆ తద్వరీ వాండ్లయొక్క స్నానాలూ అట్వంటియే యయ్తున్నయో అయన్నీ ముగించుకొనివచ్చి పుస్తకాలవ్వియివ్వి సద్దుకుంటరు. ఆ లోప్లా బోజ్నం తయారయ్యోతుంది. బోజనాన్కి వాళ్లన్పిల్వటం జర్గుతుంది. బోజనమయ్యేంతవరకూ నేనక్కడుంటానూ. ఆ తద్వరీ వెల్లోస్తాను. తిర్గొచ్చిన్తర్వాతా మజ్జాన్నం ఆఫీస్పన్లూ తర్వాతితరబ్రా యింక వేరే ఆఫీస్కువెల్టం అట్వంటియ్ చూసోక్కడం జర్గుతుంది. మేం ఆ తర్వాత్నేమో మల్లీ మజ్జాన్నం వొయ్యి రేశ నివ్వడమనే జ్జరుగ్తుంది. రేశ నిచ్చిన్తర్వాతా వంట అయ్యేంతవరకూ మేమక్కన్నే వుండి పిల్లలు వొచ్చే వరకూ వచ్చిన్తర్వాతా పిల్లల ఆటపాటలూ తర్వాతా వాల్ల హోంవర్క్ అట్వంటియ్ చూడడం జరుగ్తుంది. రెగ్లర్గా వాల్లొచ్చిం తర్వాతా కొంతసేపాడ్కోనీ- చెడుగుడూ, వేరే యితర ఆటల్మాత్రమే వున్నయ్? వాలీబాలుంది. ఈ రెండుమాత్రం నా అనుబవంలో వున్నయ్. బేట్మింటనోక్కట్టు అక్కడేం లేదండి. గదుల్లో ఆడే ఆట ల్మాకట్వంటివేం లేవండి. వాల్లకామ్త్రం ఇంగ్రెస్టున్నది. స్కూల్నుండి వాండ్లూ తెచ్చోకనాడ్కోని మల్లి తిర్గిచ్చేస్తుంటారు సామానెంగ. దాన్కి సరియయ్నపండ్స్ండవ్గాబట్టి మేమూ అట్వంటి ప్రయత్నం చేస్నా జర్గదూ అనే వుద్దేసెంగా చెయ్యటంలేదు.

యాబయ్యయ్దు మంది పిల్లలు మా బోర్డింగులో వున్నారు. అడపిల్లలనేదేమీ లేదు. లేరు. అందరు హారిజన్లు. హరిజనల్లో గూడా బంజారాస్,

తర్వాతా వేరే యితర్కేస్ట్లవాల్లు. పర్సంటేజీమ్మీద వాల్లనీస్కోటం జరుగ్తుంది. నాలుగ్నుండి పద్వరకు చద్వేవాల్లున్నారు.

మాకు కరెంటు లోపంగూడా ఒకటుంది. కరంట్ఫిటింగయింద్బిల్డింగ్తోనె. కానీ, యీ రోజలల్ల కిరసనాయిల్సరిగ్గదొర్కక చాలబాద పడ్వల్సి గూడొస్తున్నది. ప్రబుత్వం ఇట్వాంటియ్గన్క వస్తిగ్రుహాల క్కల్పించినట్టయ్తె చాల బాగుండును. కందిల్లతోనె చదుకుంటున్రు. కిర్సనాయ్లుప్పు డ్తక్కువుంది కాబట్టి కొంచెంతక్వ.

సరిపోతుందండి. నాలు గ్గదులు పెద్దపెద్ద గదుల్గాబట్టి అన్సరోవ్తుంది. ఇంకొక అద్దయు పద్మంది వరగ్గుడా అది సరోవ్వయే అవ్కాసెమున్నది. పర్హారీ గోడ గురించి మేమిద్వర్కే గవ్మెంటి క్రాసినము. ప్రహారిగోడ ఒక్టి చాల తప్ప కుండా అవ్సరముంది. పిల్లలు ఇస్టమొచ్చినట్టు తిర్గడాని కవ్కాసెమున్నది గాబట్టి అటువంటిదీ మేమూ ప్రబుత్వాన్కి రాసేము.

సినిమాలకోవ్వవాల్సునా ఇది వూర్నుండి ఒక మయిల్దూరముంది గావట్టి వూల్లో క్రావల్సునా వాల్పర్మిశ తీస్కొనే వొస్తారండి. తీస్కోకొండపోతే హాస్టల్నియ్మాల్కి వెతిరేకం. వార్డెన్గా ర్పర్మిశ తీసోకవాలి. వాల్లొచ్చిం తర్వాతా నుంచోబెట్టి వాల్లను ఇవీ అడ్గడం జర్గుతుంది, ఇకముందు అట్వాటియ్ చెయ్యకుండా వాల్లనూ నిబంధనం చెయ్డం జర్గుతుంది. ఒప్పుకోరూ అనే మాటే లేదుగదండీ. పిల్లల్గాబట్టి బోజనమంతా మన చేతులో వుంటుం ద్గాబట్టీ అట్వాంటి జర్గదు. బయ బక్తులల్నే వుంచుతమండి.

నే న్బైర్యాల్నివాస్ని. మా నాయ్నగారూ సామాన్నె కర్శకుడె. దాన్తో పాటతనూ కొంచెం వేపారంకూడా చేసేవాడు దానివల్ల నే మమ్ముల్నూ మా కుటుంబాన్ని పోషించాడతను. దానికియ్ మేమందరమూ అంత ఫర్గి పోకుండా యేదో మామూలు చదువుల్మాత్రమే చదువోక్కె కల్గినం. నాకంటె పెద్దతనూ మొదటి బార్యాతను కాబట్టి మమ్ముల్ను ప్రచ్యేక స్రెద్ద తీస్కోకుండనే అతను మా చిన్నతనంలోనే వేరయ్ పోయ్నాడు. నేనూ నా యొక్క సొంత క్రుశ్వియ్ నయ్తె క్లాస్వర్కూ చద్వగ్గలేను, అప్పుడూ సదువ్గురించి గూడా అంత పెద్ద ఇది లేకుండె. మా నాయన్గార్కె ఎక్కువ స్రెద్ద వుండె. చదువుకంటె పిల్లల్బాగు పడ్తరనె ఫ్దేసెం అతన్కి చాలా వుండి యీ బూములపయ్నగానీ తర్వాత ఇతర దన దాన్యాలపయ్నగానీ అతన్కేమి యెక్కువ స్రెద్దా అది లేకుండా మా చదువ్ల గురించే చాల స్రెద్ద వయించిండు. నేను తొమ్మిదో క్లాస్లోనె కొన్ని యిబ్బందులవల్న డిస్కంటిన్యూ చెయ్యల్సొచ్చింది. ఆ డిస్కంటిన్యూతోపాటు నే న్రాజకీయమ్మేని ప్రవేసించవల్సొచ్చి ది. అయ్తే, కుర్రతనం కాబట్టి మేమేదో ఆ కమ్యూనిస్ట్పార్టీ అట్వాంటి ఆ పార్టీలల్లో పన్చేసేం. తిర్గే. కానీ దానివల్న నాకేమంత లాబం— అంటె నన్ను పార్టీ ఆకర్శించలేకోయింది. దాంట్లో గుండా అవ్కతవ్కల్చాలా వుండె. నా మనస్సు క్చాలా బాదకల్గి నేను దాన్నుండి, పార్టీనుండి విరమించుకున్న.

ఆ తర్వాత కొమరవెల్లి దేవస్థానంలో అక్కడక్కమిటీ సభ్యులు నన్ను ప్రోద్బలం జేసి అక్కన్నన్నుంచారు. ఒక రెండు సంవచ్చరాల్వరుక్కు నేనక్కడ దేవస్థానంలో గూడ పన్జేస్నేను బుకింక్లార్గ. తర్వాత ఆ బుకి గయ్న్న తర్వాత్గూడా అక్డా టికెట్ల సిస్టెముంది కాబట్టి పట్నా లోబనాల్చెక్జెడ్డయాని క్నేన్లేదే. మొత్తానికి నా ఆ రెండు సంవచ్చరాల్చాలా విజయవంతంగనే నేన్చేస్కున్న. ఆతర్వాతా అక్కడవుండే చవ్ద్రీగారే నన్ను ప్రోచ్చహించి ఉజ్జోగ న్నేనిప్పిస్తా, మీ ర్రావాలె, వుజ్జోగమంటే చాలా బాద్యతగ నిర్వహిస్త ర్కాబట్టి మీర్రావల్సింది అన్చెప్పి నన్ను హయ్యాగ్రివాత్తీసోక్కని వెల్లిర్రు. అప్పుడు యీ సోశల్వెల్ఫేర్ డిపార్ట్మెంట్లో విలేజ్లెవెల్వర్కర్గా పోస్టు పేపర్ల నవ్స్మెంట్జర్గింది. దాన్కి క్వాలిఫ్కేశ నవ్సరమ్లేకుండె. పందొందొందల యాబయిమూడ్లో మా తెలంగాన్లో అంత క్వాలిఫ్యడ్ వాండ్లుగూడ అంత లేకుండిరి కాబట్టి దాన్కొరకు నేనప్ల య్చేస్నేను. నా కపాయింట్మెంటదిగూడ జర్గింది, రెండు మాసాల్ట్రెయినింగ్గరింది. ట్రెయినింగ్గర్వాత నన్నూ మాబూబ్నగర్డిస్ట్రిక్టు అప్పాయింట్మెంట్చేసేరు. మా నానూర్లో నేనుపోయి అక్కడ్జాయినిం గ్రిపోర్టిచ్చాను. అ తర్వాత నేను ఒక సంవచ్చరం అక్కడ్పన్చేసి వరంగల్డిస్ట్రిక్టుకు ట్రాన్స్ఫర్చేయించుకున్నాను. వరంగల్డిస్ట్రిక్లో గూడా యీ సాంగిక సమ్మేమ కార్యకలాపాల్చాలా ముమ్మరంగ వుండె అప్పుడు. అయ్తే, పూరూర్కిర్గీ నేన్చాలావరకు ప్రతీగ్రామం వెల్నేను. చానా హరిజన్వాడలలో బావులు నిర్మించడం జర్గింది. వాండ్లకూ గ్రుహ్వాసతి కల్పించబడ్డది. అట్వంట్వాటికి నాసెక్త్రీయుక్తంగా క్రుశ్చేసి నేనూ వాండ్ల క్చాలా సహాయం పడ్డాను పంచాయత్రాజ్డిపార్ట్మెంటొకటి యేర్పడ్డది. పంచాయత్రాజ్డిపార్ట్మెంట్లో డీసెంట్రలయ్జేశనవ్ పవర్స్ దాన్కిందా మమ్మల్ను పన్ను యేం తీసోక్కకుండా మొత్తమాప ఓన్వయ్తునయో యీక్వల్టిస్టిబ్యూశననేది పంచాయి త్సమితీస్ల జర్గుతుండె. అప్పుడ్మాకేం పనుల్లేనందువల్ల మమ్మల్న్నా కూచుండబెట్టి ఆఫీస్పనే తీస్కునేవాల్లు. ఆ తద్వరి మేము ఆఫీస్లోనే పన్చేసేవాల్లం, పందొమ్మిద్వందల్డెబ్బయొక్కట్లో నన్ను వార్డెన్గ మార్చి యిక్కడ్వేసేరు.

చవ్దరీలూ అనంటే గొల్లవాన్లు- అతను దేవస్థానంయొక్క యజమాని. చీఫ్ ట్రస్టీ అన్నట్టు. అయ్తే, దాంట్లో దేవస్థానన్లో రెండు బాగాలున్నయ్. గుట్టపయ్ దేవుని సమక్శంలో వొచ్చే ఆదాయ మేదయ్తేవుందో అది పూజారీ తీస్కునేవాల్లు. పోతే యీ కింద బోనాలూ యేవయ్తే జేస్తరో దాన్కి టికెట్ల రూపకంగవొచ్చే అట్వంటి ఆదాయమేదయ్తే వుందో అది చవ్దరీలకు చెందేది. వీల్లిద్దరూ కొట్లాడొక్కని యిది- దేవస్థానం ట్రస్టీ- ప్రభుత్వం ఆదీనం అయ్పోయింది. ఎండోమెంట్బోర్డు కొప్పయింది. ఆ తదుపరీ దాంట్ల వాండ్లకేదో వాటా నిర్నయించీ కోర్టుద్వారా వాల్లు ఇజ్జేస్కున్నరు. చవ్దిరి ఆనే అతను మాత్రం

గొల్ల అతను. యాదవ్లు వాల్లు వాల్లకు పెద్ద. అతను గురువుగ బావిస్తరు యాదవులు సామాన్నెంగ. ఎక్కువ గొల్లవాల్లె వొస్తరు.

కొంమవెల్లిలో మల్లికార్జునస్వామివారి ఆలయం వుంది. మల్లికార్జునస్వామి విగ్రహం ఒకటి. గొల్లవాల్లే గాకుండ యీ రోజుల్లో మాత్రం చాలా జన మొస్తుంది. తర్వాతా యీ తీర్నాల.సంక్రాంతినుండి ఉగాదివర్కా జరుగ్తుంది. ప్రతి ఆదీ బుద్వారములయందు చాలామంది వొచ్చి అక్డా యీ పట్నాలోబ్నాలూ దేవుని కొమ్కుల్లూ కానుకలూ చెల్లించుకుంటరు.

# వ్యవహర్త - 6: కాలేజి విద్యార్థి

కేంద్రం : నర్సంపేట  కులం : మున్నూరుకాపు.  వయస్సు : 18 సం॥లు

చదువు : ఇంటర్-2 వ సం॥  వ్యవహా॰ ఖండిక : ఒక కథ.

పూర్వ మ్మగధ రాజ్యాన్ని సరేంద్రవర్మనే రాజు పాలించేవాడు. అయితె, అతనోక్క భార్య వుండేది. అతనూ ఎంతమంది దేవుల్లకు మొక్కినా ఎన్ని నోము లోన్నిమినా గుడా అతనొక్కక్క కొడుగ్గూడా పుట్టకపోయె ఎన్ని గునగనా లున్నా ఎన్ని బలాలున్నా ఎంత సంపదున్నా ఒక కొడుకు లేడనే వుద్దేసెంతోటి అతడ్చాలా బాదపడ్తుండేటోడు. ఐతె. ఒక్సారేమయ్యిన్న గదాంటే ఒక మహా రుసి అతడూ పుత్రసంతానం కలిగిచ్చే దానియొక్కా వుండేదన్నట్టు ఐతె. రాజేం చేసిండూ? రాజూ రానీ యిద్దరూ అతనికొబ్బయి తన రాజ్జానిక్రప్పిచోక్కనీ ఆయన స్దిస్కాస్తే ఆయనే స్జేసిందయాంటే వీల్లకు రెండ్మామిడ్పండ్లిచ్చిండు. మామి డ్పండ్లిచ్చీ మీరు రేపొచ్చే సుక్రవారన్నాడూ యీ రెండు మామిడ్పండ్ల స్దింటే మీ కిద్దరు మంచి పుత్రులు పుడ్తరు. వారికి యీ ప్రపంచంలో అడ్డనేది యేదీ వుండదన్చెప్పని ఆరుసిచ్చి యెల్లిపోతడన్నట్టు. ఆ తరాత రానేన్చేస్తుంద్గదాంటే యీ రెండు దీస్కపోయ్ ఆడబెట్టి ఆ బుట్టలో పెట్రా పొమ్మనంటే ఆ రోజు అక్కడో చిలొక్కచ్చి ఆ బుట్టలోవున్న పండ్లను పక్కకు నెడ్తదది. అయితె. ఒక పండుపొయి పక్కింట్లో పడ్తదన్నట్టు. ఆ పక్కింట్లో యిద్దరు. ఒక ముసలామె, ఒక ముసలోడుంటరు. వాల్లగ్గూడ పిల్లలుండరన్నట్టు. అయితె ముసలోడేన్జేత్తడు గదాంటే యీ పండు దీస్కపోయ్ యిద్గో యిదేందో పండున్నది. తీసోక్కన్ను ద్దినన్జెప్పనీ ఆ ముసలమ్మ జ్జెప్పిండు. ఆమేం జేస్తది? సుక్రారన్నాడూ ఆ పండు దింటది. ఐతె, రానీన్నూ యీ ముసల్దిద్దరూ ఒకే సమ్యానా గర్భవంతులయ్తరు. ఇద్దరొకేసా గ్గర్భవతులయితె ఒక మంచి సుబ్ముహూర్తాన యిద్దరు పిల్లాన్లు పుడ్తరు. ఐతె, రాజు పరేశానయ్తడు. అరే! యిచ్చిపోయిన్న రుసేమొ యిద్దరొక్కడుక్కు ల్పుడ్తరంటే యీమె కేమొ ఒక్కడే కొడుక్కు పుట్టిండంటె అఁ, లేదు, మొన్నా ఒక మామిడ్పండు ఎక్కనోన్న పోయిందదీ అన్చెప్పనంటడు. ఐతె, రాజేంచేస్తడు? అందర్ని పిల్చిచ్చి అడ్గుతడన్నట్టు. ఇంగో పండేమయ్యిందంటే నాకు దెల్వదంటే నాక్దెల్వదన్నట్టు. సరే, పోనీ, ఎట్లా పోయిందో, ఒక కొడుకయితె వున్నడన్జెప్పని జాగ్రత్తగ చూస్తూంటా డన్నట్టు రాజు. రాజు కొడక్కెన్న పెద్ద పెర్తుంటడు. పక్క ఇంటొ గూడ పెద్ద పెర్తుంటడు ఇంకో పిల్లగాడు. ఇద్దరు ఒకేతీర్గ వుంట రన్నట్టు. ఏమాత్రమూ గుర్తుపట్టలేమన్నట్టు. ఒకర్మొదిర్గనే వొక రుంటరు. అయితె, యీ యిద్దర్పిల్లగా న్లెప్పుడూ ఇల్లుదాటి బయిట్రాలేదు. ఈ ముస్లమ్మ పిల్లగాన్నసస్లేక్క బయిటికెల్నియ్యదు. రాజుకొడ్కు అంతప్పురంనించి బయిటికిరాడు.

ఇగ రెండు విదాలా యిద్దర్బయ్టికొచ్చేటోల్గాదు. రాజ్కొడ్కేంజేస్తడదాంటే
యిగ యెటయ్నా నేనూడ్జూడాలన్చెప్పిని యెవ్వరిగ్జెప్పకుండ తప్పిచ్చుకున్బయటి
కొస్తడు. తప్పిచ్చుకున్బయ్టికొస్తెయేవర్కూ రాజబల్లేం జేత్తరు? అంతా ఎతు
క్తున్రు. ఈ పిల్లగాడింటిముం ద్కొచ్చినిల్బడ్తడు. ఇంటిముంద్కొచ్చినిల్బడ్తే
రాజ్బట్లూరో స్నాయంత్రం వర్కెత్కి యెత్కి యెక్కడ్దొర్కలేదూ గీపిలాడే
రాజ్కొడ్కన్చెప్పి నీ ముస్లమ్మ కొడుక్క న్దిసెల్తరు. ముస్లమ్మ కొడుక్కన్దిస్క
బోతే రాజేం చేత్తడూ? మన కొడ్కే అన్చెప్పి యీ పిలగాన్ని కొత్తక్కొత్తగా
జేస్తాంట డన్నట్టు. అయ్తె, అదే సాయింత్రం వరకూ ఉంకోబల్లే న్జేత్తరూ యీ
రాజ్కొడుక్క న్దిస్కొనొత్తరు. ఇద్దర్నిస్కొ నొచ్చేవర్కూ అరె! వీళ్లిద్దరెక్కడ్డి?
ఏందని పరేశానయ్తాంట్రు. పరేశానయ్తాంటే రాజేంచేత్తడు? తెల్లార్దడోరా
యేయిత్తడు. దండోరాయేయిత్తే ఆ ముస్లమ్మొత్తది. ఈన కొడుక్క నా
కొడ్కేన్చెప్పనంటె యెట్లాంటె గిట్టగిట్ట సంగతి నా మగోడ్మామిండ్పంద్తెచ్చిత్తే
గిట్ల నేత్తిన్న, తింటే పుట్టిండంటె సరె, మంజిదీ. ఈ పిల్లగా న్నాదగ్గరే
వుంచుకుంటా. వీళ్లిద్దరు అన్నదమ్ముల్మాదిర్గ పెరుగ్తరు అన్చెప్ప్రాజన్నడు.
సరె మంచిదయా అన్చెప్పనీ ఆ ముసల్దిగూడ వీలింట్లనే వుంటాంటంది. ముసల్ది
ముస్లోడూ యిద్దరూ వీళ్లింటనే వుంటాన్రు. ఉంటాంటె వీలిద్దరు పెద్దగ బెర్గిన్రు.
వీల్లెక్కడకు పోయినా యిద్దర్జంటగా పోతాన్రు. పండుకున్నా జంటగా, తిన్నా
జంటగా, వున్నాజంటగా, ఎక్కడ్బత్తెక్కడ జంటగా తిరుగ్తాన్రన్నట్టు. అన్ని
విద్దెల్లో వీలిద్ద రాత్తేరిన్లు. రాజున్నా రానీ యిద్దర్మాట్లాడుకుంటాంద్రు. ఎట్లయి
న్జెసీ వాన్ని యిహ లేకుండ జెయాల్వెల్లగొట్టాల్వాన్ని. వాన్నెల్లగొడ్తేగాని
మనోడి క్పెల్లిగీనగాదు. రాజ్జెమేలడు. మరిప్పు న్నేనుమ్మసలాన్నయ్నను.
మరిప్పుడ్రాజ్జా న్నెవరేల్తడ జెప్పనంటే జాగ్రెతో చెత్తడన్నట్టు. ఆ పిల్లాడు
మంచీల్లకనొచ్చనప్పుడింటడు. ఇగ యేం జేత్తడు గదాంటె యిగెవ్వరిక్జెప్పకుం
డెల్తరిద్దరన్నదమ్ముల్గు రాత్రిలేస్కుంటరెల్తరు. వెల్లి ఓ అడవ్లోకొస్బెయ్ వుంటాం
ట్రాల్లు. ఏంది? ఎందుకన్నా? ఎందుకురొక్కచ్చనవంటె యేన్లేదు మన నిట్ల విడ
గొట్టాల న్కొంటాన్రు, అందుకే మనం విడొస్తొవొద్దు. అన్చెప్పన్చెప్పనీ యీ
రాజుకొడ్కు చెప్తడు. రాజ్కొడుక్క చెప్తె యేం చేస్తడదాంటె సరె మంచి
దన్న పోదాంపా అని పోతరు. పోయిపోయి ఒక రాజ్జెంలో ఒక రాజున్నా దొంగ
లెత్కపోతాంట రన్నట్టు. దొంగ లెత్కపోతాంటే వీరిద్దర్కి అదవ్పడ్తది. గుర్రా
ల్దిగి ఆ దొంగల్నందర్ని జంప్తరు. ఆ రాజుక్కు ఒక బిడ్డ వుంటదన్నట్టు. ఈ
రాజ్కొడిక్కిచ్చి పెజ్లేత్తడు. పెజ్లేత్తే వీలుమ్గగురూ కలిసుంటాంట రన్నట్టు ఈ
అన్నాదమ్ములున్నా, వాల్లి వదెన్నె గల్సి ఉంటాంట్రు. ఇట్నె వుంటాంటె
ఒక్సారే మయ్త గ్గదాంటే అన్నవున్నా వొదెన్నె పండ్కొనుంటరు. వీడేంజేత్త
డంటే మామిడ్చెట్టు మీదికొస్తెతడు. మామిడ్చెట్టుమీదికొస్తెతే కొత్తగొచ్చిన,
మన వూల్లో కొచ్చిన యువ్రాజుక్కు చానా గండాలున్న యన్చెప్పని చిల్క
ల్చెప్పుకుంటాంట యన్నట్టు. చిల్కల్చెప్పుంటాంటే యీడేం జేత్తడు? యీ

డింటడు, అత్తైల్నోసవాలె. ఇగో పలాన్రోజూ రాచ్చసొత్తది. దాన్జంపాలె. దాన్తర్వాతా ఇంకో యిద్దర్మొగ్గు ర్దొంగలొత్తర్జంపెటందు క్జూత్తాంటర్దాన్ని గాపాడాలె. ఆ జంపినట్టు మాత్రం వాళ్లిద్దర్కి దెల్సెదుంటెమాత్రం తెల్పిచ్చోన్డోమో పిచ్చోడయ్యడు. వీడేమో సిలయ్యొవతడు- చెప్పినోడు అన్నెప్పని చిల్కలంటయనటు. సరె, మంచిది. ఇగ దాన్ని దాన్తాజెప్పనీ అదీ యెత్తిగ్గీ నేన్జేస్తానన్నన్నే న్రక్షించుకుంటానికన్నెప్పి ఇంట్లొచ్చి రోజు అన్న కావలే కాస్తాండన్నట్టు. అన్నా వొదిన్నా పండుక్కుంటే వీడెప్పటి క్కావలాకాస్తుంటే ఒక్రోజ్దొంగలొస్తె సంపుతడు. రాచ్చసొత్తె సంపుతడు. ఇహ్లొస్టకేంటంటె పామొత్తదన్నట్టు. పామొత్తెం జేత్తడు? పత్తలాక యల్పామొత్తది. పామొత్తె యిగ దాన్తోట్పాగ కొట్లాడి లాస్టొ క్జంపుతడు. చంపుతె దాన్రక్తం చుక్కలన్నీ యీ వొదిన్నె యెద మీద బడ్తయ్యన్నట్టు. ఎదిమ్మద్బడ్తే యెట్లా మరి? ఆ అన్నకన్నా వొదినె కెవ్వరిక్దెలవద్దాయె. అన్నెప్పన్వీడేం జేత్తడు? పరేశాన్గా చానసేపటీటూ జూత్తాంటడు. ఏద్దొరక్కదన్నట్టు. ఇగ తెల్లార్నాలగ్దయయ్తాంటది. నల్గయ్తాంటె యెట్లా యిగ తెల్లారోపతాంది. లేస్తె యెట్లాంటది? రక్తపుచుక్క లెక్కడియన్పరేశానయ్తరన్నెప్పని అంత అలుకుతడు. అల్కిఅల్కి యేదీ వుండుక్కుంద్జేస్తడు. కనీ సెరిరమిమ్దబడ్డ రక్తన్చుక్క ల్మాత్రం పోయెట్చెయాలంటె యేం జెయ్యాలె? అన్నెప్పనేం జేత్తడు గదాంటె ఆ వొదినె ఓనేసి ఆ నాల్క తోట్దాని న్నాకుతుంటడన్నట్టు. ఆ రక్తా న్నాకెయంగనె లేత్తది. లేసి, వొదిన్లేసి, అన్నతో జెప్పంగనె, అన్నా వొదిన్లేచి వీడేదో తప్పు జ్జేసిండజ్జెప్పిజ్జెప్పి తెల్లారి రాజసభలొ పెట్టి వీనేదో అడుగుతాంటరనట్టు. అడిగితే- అప్పడ్కే వీళ్లన్నా భార్య గర్బవతన్నట్టు. రాస్పబ్లొపెట్టి చెప్తాంటె— ఓర్నేజెప్త. నాకేన్నెప్పాలన్గాదు. కనినేన్సిలయ్యొవత. నువ్మాత్రం పిచ్చోడ్వయ్ తిర్గుతాంటవన్నెప్పనంటడు. నేన్మాత్రం యే తప్పూ చెయ్లెదన్నా అన్నెప్పన్నాగూడ పూరోక్కడన్నట్టు. ఊకోకుంటె నాకేద్దెల్వదన్మొదల్గాలె చెప్పాలన్నెప్పన్నడు. ఒదినొస్తది. ఒదినొచ్చి కొడ్తది. కొట్టినాగూడ నువ్వేన్ని గొట్టు యేవన్నా జెయ్ నేనేమనన్నాంటె, బటుల్తోటి అందర్తోటి గొట్టిచ్చడు. ఎంతో మంచేత గొట్టిచ్చాన్గూడ వీన్ని జంబట్టయ పెడ్తలేదన్నట్టు. లాస్టుకు నిజం బయ్టపెట్టకుంటె వీలన్నేం జేత్తడు? నిన్జంపుత అన్నెప్పనీ చిన్నప్పన్నించి న్నేయితం చేసిందిందుక్కేన? ఇప్పున్నిన్నెట్లయ్న జంపుతా న్నెప్ప నొత్తడన్నట్టు. సరె, మంచిది, నన్ను చంపితే చంపిత్గాని నేన్మాత్రం జెప్తాంటె, యే అట్లాలేదు నువ్వెప్పినతర్వాతనే చంపుత. చెప్పేదన్క అపత్కే చంపనంటడు. సరే, మంచిద్లే, నే చెప్త చెయ్ అన్నెప్పనీ రాస్సబలో నిల్బడ్చెప్తాంటడన్నట్టు. నేను ఒకసారి గిట్ల జేసిన. రాచ్చసి న్జంపిన అన్నెప్పని అంత జెప్తడన్నట్టు. అంత జెప్పెవర్కేమున్నదీ? మరీ దీనికి విముక్తేదంటే లాస్టుకు సిలన్పొయే ముంజెప్తడన్నట్టు. నీ కొడుకున్నుబ్ధిసి నా సిలగొట్టినవంటె నువ్మాత్రం మంచిగయ్తవ్. పిచ్చినీగ్గుదుర్కుంటదనం

టడు. ఆ జర్గిన విసయల్నొత్తం జెప్పేవర్కిమవుతదయ్యాంటె వాడ్సిలయ్యోపోతడు విడ్పిచ్చోపేడ య్యిర్గాంటడు. ఇహా పీల్ల తన్రి పీల్లకోసం ఎతుక్కుంట ఎతుక్కుంట వస్తాంటడు అరె! ఇట్ల జరిగోపోయిందా న్చెప్పని రాజూ రానీ యిద్దరు పీల్ల కోసం తిరుగ్తాంట్రన్నట్టు. తిరుగ్తాంటే రాజకుమారు న్భార్యా గర్భవతయ్తది. కొన్నోల తర్వాత కొడ్కు పుత్తడు. ఈ పిచ్చోడ్రోజూ యింటి ముందర్కొచ్చి పోతాంటడు. భార్యేంచేత్తాంటదీ? రోజింతన్నం బెడ్తాంటది అన్నంబెట్టి యెంతో వుండమన్నా వీడుండడన్నట్టు. పిల్గాడు నాన్నా నాన్నాంటె పిల్గాన్దీస్క న్వూరంతా దిప్తాంటడు. ఊరంత దిప్పి మల్ల దీస్కొస్తాంటడు. ఓరోజు ఆ సిల దెగ్గిరి కోపోతాడన్నట్టు. ఈ పిల్గాడ్పోయ్ నానా నాన్నా యిట్రా యిట్రా అనంటే యేం నాన్నా లేదేం లేడ్రా అని పిల్గా న్కాల్పటోర్ నాసిలగ్గొడ్తడు. సిలగ్గొడ్తే తల్కాయ్ పల్గి ఆ రక్తం దాన్మీద పడ్తది. సిలమీద న్బడేవరకూ సిల మన్సయ్తదన్నట్టు. అప్పుడూ యీ పిచ్చి బోతది. అప్పు డ్జరిగిన్దాని కెల్లోస్కనీ యిగపుడు నేనూ తమ్మున్నెంత పజ్నేస్తినీ? నిన్నే నేనన్మానించినాని చెప్తడన్నట్టు. అంటె తల్లి దండ్రులొస్తరన్నట్టు. తల్లిదండ్రులొచ్చి మీ పవిత్రమయ్న స్నేహాన్ని చెడ్గొట్టాల న్జూస్నేం, మాత్తప్పయ్ందన్చెప్తరన్నట్టు. అయ్తె యిగ యిక్కడ రాజుకొడ్కు పెల్లి చేస్కునొన్నడేమో యిక యీన్నే వుంటాంటడు. ఇగ ఆ పాతరాజెంలో యీ పిలగాడుంటడు. ఇద్ద రన్నదమ్ములు పీల్ల రాజ్జాల్కి రవానా మార్గాలూ యేర్పుంచొకనీ వీలిద్దరు సుకంగా కాలం గడుప్తాంట రన్నట్టు. ఇశ్నే వాల్లమీదికి అడ్డెవర్గనీ యేదీ లేదన్నట్టు. ఎంత పెద్ద సేనల్వొచ్చిన గూడ వుత్తుత్తగనే వోడిచ్చి యిక వాల సామ్రాజ్జంల కొన్ని సంవచ్చరాల్పాటూ సుకంగా గడిపింద్రన్నట్టు. ఇదీ ఆ కద.

# వ్యవహర్త - 7 : రైతు

కేంద్రం : ఏటూర్నాగారం. కులం : వైశ్య వయస్సు : 40 సం॥లు
చదువు : 7 వ తరగతి వ్యవహారఖండిక : స్వగ్రామం–తీర్థ, వినోదయాత్రలు

నేను యేటూర్నాగారం సర్పంచ్గా పందొమ్మిది వందలా అర్వయ్యొలుగ్లో యెలక్టయ్యాను. అందులో నేను యేకగ్రీవంగా యెన్నికయ్యాను. తర్వాతా ఆ సంవచ్చరం యేటూర్నాగారం గ్రామ పంచాయ్తీ పెద్ద పంచాయ్తీగా జరిగీ వెయ్యి రూపాయ్లు కూడా గ్రామ పంచాయ్తీకి సర్కార్వారు యిచ్చినారు. తదుపరీ యేటూర్నాగారం గ్రామమ్లో రోడ్లుగానీ యీ పిల్టర్పాయింట్లూ గ్రామ పంచాయ్తీ నుండి కొన్ని వేయించబడ్డాయ్. గ్రామమ్లో యిప్పుడు దాదాపు ముప్పయ్ ప్లిల్టర్పాయింట్స్ చేయ్యబడ్డాయ్. ప్రజల్కూ చాలా అందుబాట్లో మంచిగా ప్రతిరోజూ మంచినీరు లభిస్తున్నది. అంతేగాకా యేటూర్నాగారం గామం చాలా డెవ్లెప్మెంటుకావల్సివుంది. ఏటూర్నాగారం గ్రామానికీ నీటివనరులు గానీ మరియూ సరియయ్న అవకాసేలు లేకా చాలా ఆర్థికంగా వెనకబడుంది. గ్రామానికి చాలా పెద్ద చెర్లు గూడా లేవు. ఈ యొక్కా యేటూర్నాగారం గ్రామానికే కాకా మొత్తం బ్లాగ్గూడా మంచినీటి వనరుల్లేకా పంటలూ పూర్తిగా పండటల్లేదు. ఏటూర్నాగారం గ్రామం అభ్రుద్దికావాలంటే మరియు బ్లాకభ్రుద్ధి కావాలంటే యేటూర్నాగారంలో దగ్గర్లో వున్నట్వంటి పద్మయ్ల్ల దూరంలో వున్నట్వంటి వొక దొడ్డ ప్రాజెక్టూ అది పూర్తిగా నిర్మించినచో యేటూర్నాగారం బ్లాకూ పూర్తిగా సస్సెస్సేమలం కాగలదు. ఇంతేగాకా యేటూర్నాగారం బ్లాకులో హార్జన్లూ గిర్జన్లూ చాలా యెక్కువ్మంది వున్నారు. వారికి ఆర్థిక సహాయం పూర్తిగా డెవ్లప్మెంటుకావడం లేదు. ఆర్థికంగా చాలా వెన్కబడివున్నారు. అంతే కాకా యేటూర్నాగార న్దేవాలయ్మనకూ వొక పూజారికూడా లేదు. ఏటూర్నాగారం గ్రామములో వొక సివాలయ్మూ మరియు రామాలయ్మూ రెండు ఆలయ్మ ల్కలవు. సివాలయ్మూ పూర్తిగా సిదిలమయ్పొయ్నది. ఈ సంవచ్చరమూ దానిని పూర్తిగా పునర్నిర్మానం చేయ్చున్నాము. కానీ ప్రభుత్వసహాయ్మూ అందటల్లేదు. పూర్తిగా పజలయొక్కా సహకారన్తే తనే యీ గుడి యీ సివ్రాత్రి వరకూ పూర్తి చేస్తామని ద్రుడసంకల్పంతో వున్నాము. ఏటూర్నాగారం గామమ్లో వొక జిల్లా పరిశత్తు అయ్స్కూల్కలదు. దానికి పోయినస్సంవచ్చరము మా కమ్టీ తరపు నుండి యిర్వయ్బెంచీలూ మర్యూ పదికుర్చీలూ కమ్టీ సభ్యులు కూర్చుంటందుకు గాడ్రెచ్చెయ్ర్సొకయ్దూ పదిహేనో ఆగస్టుకు స్వెంటీసిక్స్ జనవర్కి చందాపూర్వకంగా కొంత డబ్బు వసూల్చేసి యిచ్చినాము. మరియూ ఏటూర్నాగారం గామమ్లో

వొక కోవాపరేటివ్సొసట్టి గూడ కలదు. ఆ సొసట్టి ద్వారా ప్రజలకు ఆర్ధిక సఆయము కొంత దొరుకుత్తున్నది. స్కూల్లోకూడా యీ సంవచ్చరమూ నేనూ యేకగ్రీవముగా ప్రారంబకమ్టీ వయ్ప్రెస్డెంటుగా యెన్నికయ్యాను. మరియూ కోఆపరేటివ్సొసట్టీ అద్యక్షునిగా కూడా నేను యేకగ్రీవముగా యెన్నికయ్యాను. ఈ గ్రామమ్లో అన్ని విదాలా చాలా ప్రజలు యెంతో మంచిగ సహకారంగా పన్చేస్తూ వుంటారు. కానీ యీ సంవచ్చరము పురుగుచేత పంటలు పూర్తిగా పండలేదు. ఎరువులు కూడా సరియయ్న దరలకు అందుబాట్లో దొరకలేదు. దానివల్లా యిక్కడి రయ్తులు చాలా నస్టాల పాలయ్యారు. ఇక్కడ ఆర్దికంగా మిర్చి, పొగాకూ, పత్తీ యెక్కువ్పండ్తాది. దానివల్లనే ప్రజలకు చాల్లాబము చేకూర్తుంది. ఇకా యిక్కడ పెసలూ, మినుములూ, కందులూ, జొన్నలూ, నల్లపెసలూ యెక్కువ పండుతాయి. దానిక్తోడు యీ సంవచ్చరమూ పంట కొంచెం తక్కువ్గానే వున్నది. కానీ మిర్చి పురుగ్చేత చాలా దెబ్బ తిన్నాది. ఇంతేగాకా యిక్కడ రయ్తులు పూర్తిగా వెనుకబడటానిక్కారనం ఆర్దిక సహాయము పూర్తిగా లేదు. కాబట్టి ప్రబుత్వం వారు ఆర్దిక సఆయం అందించినచో యిక్కడ ప్రజలు చాలా బాగుపడగల్రు. ఏటూర్నాగారం గ్రామం ప్రతీ సంవచ్చరమూ దాదాపు దగ్గర్కి గోదావరి వస్తునేవున్నది. పందొమ్మిది వందలా యబయ్ మూడులో యేటూర్నాగారం గ్రామం సగం వరకూ మునిగ్పోయింది. అప్పుడు యేటూర్నాగారం యిక్కన్నుంచ్తీసి తాలగోడుకూ కడ్దామని వొక ప్రపోజలు వుండేది. కానీ తర్వాతా యిక్క్రయ్తులు నీల్లకుద్దారమయ్తామని యిక్కన్నుంచ్కదలలేదు. తర్వాతా యిక్కన్నె అందరూ వుందామని వొక వుద్దేసేనికి వచ్చి యిక్కన్నె వుంటున్నారు. అయ్నా యేటూర్నాగారం గ్రామం సురక్సితంగా వుండాలంటే లక్నవరం వాగు గ్రామం దగ్గర్నుండి పోవుచున్నది. కాబట్టి యేటూర్నాగారం గ్రామమ్పొడవ్నా వాగడ్డుకుంటా వొక రాయితో పూర్తిగా వొడ్డును కట్టాలె. లేనితోడుంటే వొక పది సంవచ్చరాల్లో యేటూర్నాగారం పూర్తిగా యిక్కన్నుండి పోగలదు. చాలా నస్టము జరగగలదు. కాబట్టి యెట్టనయ్నా ప్రబుత్తం వారితో యీ పనిచేయించాలనీ, దాన్ని సాదించాలనీ యేటూర్నాగారం ప్రజలు చాలా గట్టి ద్రుడ్విస్వాసన్తో (దృఢ విశ్వాసంతో) వున్నారు.*

తిర్పతి దేవాలయం చూసేనండీ. మూడుసార్లు వెళ్లేనండీ. ఒక సంవచ్చరమయ్ంది. మా పిల్లల్తోటి అక్కడిక్వెల్లినం. అక్కడ వొక సత్రం తీస్కోనీ అక్కన్నె వున్నం వొక రెండు రోజులు. ఉన్న తర్వాతా దేవున్దర్సెనజ్జేస్కోనీ

---

* ఇంతవరకు ఈ వ్యవహర్త వచో ధోరణి ఒక బహిరంగ సభలో ఉపన్యసించినట్లుంది. ఇది చాలా వరకు గ్రాంధికభాషలో నడిచింది. (ఇతడు గ్రామ సర్పంచ్గానూ, కోఆపరేటివ్ సొసైటీ అధ్యక్షుడుగానూ, పాఠశాల ప్రారంభ సంఘాధ్యక్షుడుగానూ ఉండటం దీనికి కారణమై ఉండవచ్చు.) ఇక్కడి నుండి వ్యావహారిక భాషలో మాట్లాడటం మొదలుపెట్టాడు వ్యవహర్త.

ప్రతిరోజూ అక్కడ పల్హారా త్తీసోక్కొనీ వుండేవాల్లం. అక్కన్నుండి బస్మీదెల్లి అక్కడ్రెండ్రోజులుండీ తర్వాతా దేవున్కి బోగంజేయించీ మల్లీ ఆరోజు యింటికి వచ్చాం అన్కొనేవరూ అక్కడా సత్రంలో రెండ్రోలకంటె ఎక్వ వుండనియ్రట. అది మాకు దెల్వదు. తర్వాత వాల్లు మే మేసి న్తాలమ్మీద వాల్లు తాలం వేసిన్రు. ఆ తాలం వేసిన్తర్వాతా మరి వాల్లనోపోయి మేం బతిమ్లాడ్కోని యీ రాత్రి పండుకొంటామన్చెప్పి మరి వుండి మల్ల తెల్లారొద్దుగాల్నె వాల్లు తాలం వేసే స్కన్న తర్వాత మేం సామాన్లు తీసోక్కొనీ యిగ్మేమింటికొచ్చినం. తిర్పత్లో వెంకటేస్వెరస్వామి దేవాలయాని కోయినం. లోపల దేవున్ని దర్శించుకున్నం. మరి అన్ని, అక్డా ఆకాసెగంగా, పాపనాసెనం,...కంచిబోలేదండీ. ఎందు కొర్కంటె అక్కడా ఫ్మేమిలితోని పోయినప్డూ చాలా పిల్లలున్రు గాబట్టి, జర మొచ్చిందప్పుడు మాకు. దాదాపు యిక్కనుండి మేము పన్నెండు మందిం బోయ్నం. అందులో మరి మా తమ్ముడూ, మా మర్దల్వాల్లక్జర మొచ్చింది. దా న్తర్వాతా మెద్రాసుచ్చిద్దామని తొందర్తోటి... మెద్రాసోపోయి న్తర్వాతా, అప్పుడ్మేం పోయ్నప్డూ, అక్కడ్వర ల్డెగ్జిబిశ నుందండీ. వరల్డెగ్జిబిశన్జూసినము. ఆ వరల్డెగ్జిబిశన్కొచ్చినప్డు బాగ చలిగావుండె. ఒక రశ్యాన్ష్టాన్ల్యూసినము. ఆ రశ్యాన్ స్టాల్యూసిన్తర్వాతా మరి అందులో చెయ్నాస్టాల్వరగోయినం. చెయ్నాస్టా ల్మాత్రం కాలీగనే వుంది. అప్డూ ఆ చెయ్నాస్టాల్లో యేం సామాన్లేవ్. మెద్రాస్గ వర్న్మెంటువాల్లు సేల్స్పెర్మిశన్లేకుంటుండె. కాని అక్కడొక డశ్కొన్ది వొక మిశి నుండె. మా ఫ్మేమ్లీగాని, మా చుట్టాల్గాని, వొచ్చిన వాల్లందరు చాల చూసి చాల ఆస్చెర్రె పడ్డార్దాన్ని చూసి. తర్వాతా అక్కడ్... (అ) నీ యిక్కడ హ్యద్రా బాదు మిటాయిదారున క్మంచి పెరొచ్చిందక్డ. అయ్తె మేము చాల సంతోశ మయ్ యెందుకంటె అద్యారాబాదు నేతిమిటాయ్గూడ యిక్కడ గూడ చేరోపో యింది అనోకొని మేం గూడా వొకాద్రూపాయిల్దొన్కున్నం. కొనొకొని అక్క ట్టెల్వజ న్చూసినం. ఆఁ,తిర్పత్లో గుండుజేయించుకున్నం. గుండు జేయించోకొని మరి అక్కడ బోగన్జేయించీ పులోరా వొక యాబ్రయూపాయిల్పెట్టి పుల్హోర్చే యించినం. యబయ్ జేయిన్తే వాల్లు చాలా బెట్టిన్రు. అదందరికి పంచ్పెట్నం మేం తిన్లేక. ఆరోజు వేమన్నం గూడ తిన్లేదు. కొంచం తట్లో బెట్కొనొచ్నం. అద్గూడా అప్పుడు మేం తిన్కుద్దిగాక అందర్కి పంచ్పెట్నం అక్కడ్గూడా. ఇగక్కన్నుండి మల్ల మెద్రాస్జెర్కున్నం. మెద్రాస్జెర్కోనీ మల్లీ అక్కడ్గూడా... వరల్డెగ్జిబిశన్లో టెలివిజ న్రేడ్యోచూసేము. మరీ పెద్ద పెద్ద మిశిన్లు చూపించిన్రు. అవేమో చూస్కుంట బోయ్నం మొత్తం స్టాల్సన్ని. అక్కడ్జూస్తె దాదాపిర వయ్ వేల కార్లు ముప్పయ్ వేల కార్లు వుండె. నడ్చిపోయి నడొచ్చిన మక్కడ బస్సుమీద సర్కార్ బస్సుమీదబోయ్. చూసిన్తర్వాత మల్లీ యేమయ్యిం దంటె యిగా రాత్రయ్పోయింది. చలిబాగ...ఇగలాడ్జింగ్లొ దిగ్నం. అక్కడ వరల్డెగ్జిబిశనున్నద్గాబట్టి ఒక లాడ్జింగూడ దొర్కలేదు. ఒక కారేసుకుని హృదయ

న్నించి సాయింత్రం తిర్గినం. తిరిగితే వొక్క మయేంద్రలాడ్జని వొకటి దొరికిందక్డ. ఆ మయేంద్ర లాడ్జింగ్లో వున్నం. ఒక రూముకూ నలబయ్ రూపాల్యు. మొత్తం యెనిమిది మందిం అంద్లొవున్నం.ఏడెన్ది రోజులకూ రెన్నాల్గులెన్బ్రయూ పాల్యస్యొయింది. మల్లా అక్కన్నుంచి యింకొక రూమ్దీస్కున్నం. అప్పుడుంకో నల్బ్రయూపాల్యయ్యన్నయ్. మొత్తందాదావూ అక్కడ చాలారూపాల్యు కర్బయ్యన్నయ్. ఎక్కువ కర్బయ్తయ్యనే వుద్దేసెంగ మేం కొన్ని సామాన్లు యిత్తడ్సామాన్లు కొన్ని స్టీల్సామాన్ల వన్నిగొనొక్కని జరల్బాగొచ్చినయ్గాబట్టిం దర్కియిక్కడ్రైల్లొయెక్కి డయెర్క్టు వొరంగల్లొచ్చినమండి. ఎగ్జిబిశనంటె చూడండీ మేమూ సాయింత్రం యెన్మిదగంట్లకు బోయినమండీ. పోయీ వొంటిగంటదాక వున్నమండి రాత్రి. చూస్తెనేమొ చాల సర్పెట్టింది. ఇది వొక్క రోజ్జూస్తేనె సరొప్పదు. దాదాపు వొక పదిరోజుల్చూస్తేనేకానీ ఆ యెగ్జిబిశన్కసరొప్పయేట్వంటి వున్నది. మర్సట్రొజిక్మాక్జర మొచ్చిందగ్గాబట్టిక మేము ప్రయత్నన్చేస్కునీ అందరూ యింటికొచ్చేసినం. మెడ్రాస్లొ చెయ్యాన్నబజారదీ చూసేమండీ. సముద్ర మొకట్జూసినం. ఆ సముద్రన్జూస్తే మాత్రమ్మా పిల్లలూ మేమూ చాల ఆస్చెర్రెంగా వున్నది. ఎందుకంటె పెద్దపెద్ద కెర్టాలొచ్చేసీ మాకు పెద్దగ్గన్పిచ్చి మేం దూరం కూచుంటె గూడ మా దగ్గర్కే వొచ్చుడు పెట్నేది. మేమింకా దూరంగ బోవుడు పెట్నం. ఒక వెయ్యీ రెండువేల మంది అందరున్నరు. దగ్గర్దగ్గరొప్తాన్రు. కొందర్దూరం పోతాన్రు. ఒక పడవయ్తె మాత్రం వొడ్డుమీదనే వున్నదది. సముద్రం మీంచి బయ్టికొచ్చిందీ మాకు యేమత్తెల్వదది. కాన్చెడొప్పయిందది. ఆ యొక్క పెద్ద స్టీమరు పెద్ద సముద్రంలో వున్నది. నట్టనడ్మ మేమన్కున్నం. దాన్ల మన్సులున్నరాంటే పెద్ద పెద్దదాన్మీద బిల్డింగ్లే కన్బడ్డయ్మాకు. ఆ బిల్డింగ్జూసినము. అక్కడ ప్రజలున్నరు. అక్కడొక వూరి ప్రజలు గన్పడ్డది. మా యేటూర్నాగార మా వూరంతే వున్నదక్కడ. అక్కడంత దూరం గన్పడ్డ దక్కడ. కాబట్టి చాలా—కూరొచ్చనీ తర్వాతా యెగ్మూర్స్టేశనొబ్యన్నం. మరి జూ బోయినము. మూజియమ్జూసినము. అక్కడా మెడ్రాస్ హయ్కోర్ట్ జూస్నము. మరి బెంగ్లూర్బజార్జూసినం. చెయ్యాన్నబజార్జూసినం. చూసీ మరి బ్రుందావనొబయినం. ఎలెక్ట్రిసిటీ హవ్సెక్కనం. అవన్నిచూసీ యిగ వొచ్చినమండి.

# వ్యవహర్త - 8 : కిరాణావ్యాపారి

కేంద్రం : హన్మకొండ (వరంగల్)   కులం : బలిజ   వయస్సు : 58 సం॥లు
చదువు : 4 వ తరగతి   వ్యవహార ఖండిక : స్వవిషయం.

నేనుపుట్టింది వరంగల్లు—హనంకొండ. నేను మొదట్లో చాలకష్టపడ్డాను. తర్వాత హనుమకొండనించి హయ్దరాబాదు వెళ్లేను. హయ్దరాబాద్లొ నాలుగ్సంవచ్చరాలు గవర్మెంటొక్కొల జ్జేసేను. దాన్తర్వాత-కొలువొబ్బెయ్నంక—జాగీర్లో ప్రవేసించాను. పాపన్నపేట్లొ పదిహేనూ ఇరవయ్ సంవచ్చరాల్పన్చేసేను అక్క-న్నించి నవ్కర్పోయింది. జాగీర్దార్ యేమివ్వలేదు. అక్కన్నించి మల్లనుమకొండొచ్చాం. హనుమకొండ వొచ్చి యిక్కడ మల్లీ చిన్న కొట్టుబెట్టే. కొట్టులోగూడ చాల నష్టమయ్యింది. అయ్నగూడ మేం మల్లి దాన్ని పయ్కి దీశేం. తీసి యిప్పుడు మాత్రం సవ్కెంగా వుంటున్నాం.

నా పిల్లలు అయ్దరాబాద్లొ వున్నారు. ఒక అబ్బాయి యమ్మే చదువ్తన్నాడు. ఒకబ్బాయి నవ్కరీ జేస్తున్నాడు. అతనికి ముగ్గురు పిల్లలు. ఆ పిల్లవానికోసరమూ పెన్లివిశయంలో సేన్ప్రియ్త్నం జేస్తున్నాను.

నేను హయ్దరాబాద్లో వుండి బెంగ్లూర్చూశేను. మయ్సూర్చూసేను. మద్రాస్చూసేను. అవ్రంగబాచ్చూశేను. అక్కన్నించి మల్లీయిటువచ్చి వ్యాపారం చేస్తున్నాను. వ్యాపారంలో అనేక ఇబ్బందులున్నయ్. ఏమిబ్బందులంటె సెల్స్టేక్స్ ఇబ్బందుంది. మాకు వేరే ప్రతివాన్లు దీని విశయంలో వేపారస్తుడన్చెప్పి పట్కుంటారు. అంచేత మేం యేమీ చెయ్లేక పోతున్నా మిప్పుడు. ఈ సంవచ్చరమయ్తే మాకు చాల యిబ్బందులయ్పోయి రేశన్షాపులన్ని కులాయించి రేశనయ్యా మాకు బియ్యం కూడ దొరకకుంటయ్పొయ్నయ్. తరవాత -యిప్పడిప్పుడు_నిన్న యివ్వాల-మాక్కొంచెం బియ్య మిస్తున్నారు. దాన్నించి మల్లీ వేపారం శురూ అయ్తొంది. లేదూ అంటె చాల కస్టంగ వుండేది. జీవ్నోపాయం గడిచేది గూడ చాల కస్టంగుండేది.

నేనా ? ఆఁ, ఇస్తున్నాను కాతాలు. కాతాలిస్తాను. తిరిగిస్తుంటారు. కొంతమంది ఎగదొబ్తారు. అట్ల గూడుంటుంది. ఆ బాదలున్నయ్మాకు. లేకెట్ల?

చెక్కెన్లేదండి. మాక్కంట్రోలున్నది. చెక్కెరివ్వరు. చెక్కెరివ్టంలో మేం చాల బాదపడ్తున్నం గాని యిస్తలేరు.

చదువ్కున్నవాండ్లు, టీచర్లూ, ఎడ్మాస్టర్లూ అవ్ ఆఫీసర్లుగూడ వున్నరు కొంత మంది. వాన్లుగాదండి. ఇంకో చిల్లర్చిల్లర్ ...కొంత మంది మాస్టర్లుగూడ యివ్వకపోతున్నారు-ఇప్పుడు. ఇక్కన్కె వొక మాస్టరున్నాడు. అతను ట్యూనొన్ల చేస్తాడు. నెలకు నాలుగయ్దొంద ర్రూపాయ్లు సంపాయిస్తాడు. ఏమ

న్నంటె నాక్కార్చు ల్చాత్తలేదయ్యా అన్చెప్పి రెన్నెల్నించా పేడు. మేమెటు చెప్పలెం. అది.

వరంగల్నించి దెస్తము. వరంగల్నించ్ దెస్తం మొత్తం సరుకుని. ఆఁ. ఇక్కడేం కరీజ్జెయ్యం. సిర్పేమయ్యా సిగ్రేటూ, యీ అగ్గిపెట్టెలూ యీ అనుమకొండలో కరీజ్జేస్తం. ఇదీ పదియేన్సంవచ్చరము లయ్యంచ్చాకు.

నేను ఫ్యాపారం జెయ్యేదండీ. నవ్కరున్నాను. నేన్కేశియర్గ పన్జేసేది. ఏది ?– పాపన్న పేట సంస్తానంలో కేశియర్గ పన్జేసేది. పబువెవ్రూం ? ... మాకు ఇర్వయ్ రూపాయ్లు జీతమిచ్చేది. ఇర్వయ్ రూపాయ్ లలెవెన్సిచ్చేది. నలబ్రయూపాయిల్లోపట నాక్కుటుంబమ్మొత్తం అక్కడ వుండేది మేము-నా బార్యా, నేనూ, నా అల్లుడూ, అల్లునిబార్యా-నల్గుర మద్యుగుర ముండేది. మేనల్దండీ. అప్పుడన్సర్పోయేది. నాకే బోజ్నం దొర్కేది వాళ్లదగ్గర కొద్గా. వాళ్కొద్గ -మావొక్కరికిద్దరికెప్పట్టేది. తతిమ్మది మాకు సవరిచ్చుకునేది. వసతిచ్చారు. రూపాయికి యెన్మిస్సేర్ల బియ్యముండె అప్పుడు. ఇప్పుడెక్కడియి? ఒక రూపాయ్పెడ్తె యెన్మిస్సేర్ల బియ్యమొచ్చేది. ఆయెన్మిస్సేర్ల బియ్యము మేంగడ్పుకునేది.

ఆ. ఇక్కడ సొంతయిల్లు, కొంచెం ఇల్లు కొనుక్కున్నాన్నేను. కొనుక్కోని -నాలుగ్వేల రూపాయిలగ్గొన్న. కిరాయొస్తుంది. మాకో యాబ్రయూపాయ్లూ అర్వ్బ్రయూపాయ్లు కిరాయొస్తుంది. హాయిగ, సుకంగ వున్నాను. మా అబ్బాయికి నెలకు యాబ్రయూపాయ్లు పంపిస్తాను. ఆ అబ్బాయ్, చిన్నబ్బాయ్, చదువ్కొంటున్నాడ్గద? అతనోకసం పంపిస్తాను. పెద్దబ్బాయేమో నవ్కర్జేస్తున్నాడు ఎలక్ట్రిసిడ్డిపార్ట్మెంట్లో. అతని తబాయిదా కోసం ప్రయత్నం జేస్తె కాదన్నారు. కాదంటే, సరె, అకన్నె వుండు నాయనా జెప్పి వాన్నకఁన్నె వుంచాను. ఆ అబ్బాయిని గూడ-యిప్పుడు యమ్మె సెకండియర్చదుప్తున్నాడ్తెలుగు. అక్కడున్నాడు. రాలేదండి. ఇర్వయ్యాన్నల్గు తారీకొస్త నన్నాడు. ఈ ఇర్వయ్యాన్నల్గు తారీక్కె.

మాకు బంధువ్లు తిర్మల్గిరీ-సూర్యాపేట్తాలూకాలో తిర్మల్గిరి కొండా అక్కడున్నరండీ. ఇకడ్మేమున్నం. హయ్ద్రావాద్లో మా అల్లుడూ వాళ్లున్నారు. అప్పుడప్పు డొప్పోయొస్తుంట మక్కడిక్కి. ఇక్కడుండేది యిద్దరేనండీ-నా బార్యా, నేనూ. మనవ్రాలు మొన్నపోయిందండీ. హయ్ద్రావాదిడ్చొచ్చాను. ఆఁ, నేనే పోయొచ్చాను. ఊకే అడుగ్తుంటే యిడ్చొచ్చాను. అవ్ను. మల్లీవొస్తా నన్నది. అక్కడికొచ్చిన్నంక రానన్నది.

య్యేనేం...కొంతమంది అప్పుడుపూర్వ సెక్రెట్రీ వాళ్లంతా ప్రయవీజేసి యిక్కడ ఓ మూల్లచ్చ్రలూపాయిల్తోని కాల్నీ గట్టిచ్రిను పెద్దది యాబయ్ గ్రుహాల్తోని. యాబయ్ గ్రుహాల్తోసి కాల్నీ గట్టిచ్చి, కట్టిచ్చడం యింక వొక సంవచ్చరం గూడా కాలే. కాకుండనే అస్సూపర్సీటయ్పొయింది. సూపర్సీటనంటే అది కొంత లిక్విడయ్పొయినట్టు. లిక్విడయ్పొయి న్తర్వాత అయి వట్టిగనె ఉన్న య్యాయిండ్లు. అయ్తె అప్పుడు గవుర్మెంటొచ్చి యీ సొసయ్టిని హేండో వర్జేసొకనీ అప్పుడు మల్ల వాళ్లను బిల్చి మరి యీ కాల్నిలో నెవరుంటలేరు. మీకోసం గట్టిచ్చినం మేము మూల్లచ్చ్రలూపాయిల్బెట్టి. మరీ దీన్ని యెట్లా వుపోయగించుకుంటర్మీరు? అనంటె—మేమప్పు డొక్కత్తగున్నం. మేముంటం సొరన్నం. సరె, యిక్కడోల్లుండనట్టు మాకోటి రాసివ్వా లెన్నరు. అయ్తె అప్పుడు యిక్కడ...ఉండిండె, ఆయ్యూర్నరూరా తిర్గుండె. అయ్నవూరూరా తిర్గితే వాళ్రాసిచ్చిన్రు, మేం ఆ యిండ్లల్లొ క్రాము, మేముండమని. అయ్తె మల్ల గవర్మెంటేం చేసిందంటె యిప్పుడు వీల్లుండరు, ఆ ష్టయ్ ల్నడవదని లిక్విడేశ న్చేసేసిన్రు. చేసి న్తర్వాతా అప్పు డ్కలక్టరుండె- పంద్రొంలరవల్లు. ఆ కలక్టరుండి మీరెవరయ్న పద్మసేలీ లొచ్చునట్టయ్యుంటె యిచ్చెస్తం అనన్నడు. అప్పు డ్నేమేం జేసినమంటే మే మొచ్చుంట మందులొ, మర్మాకప్పనులు గల్పిస్త రాంటే కల్పిస్తమన్నరు. మేం పన్లు గల్పిస్తం, మీకు సొసయ్టీని హేండోవర్జేస్త మన్నరు. సరే, అందర మొచ్చినం. సంవచ్చరం రెండు సంవచ్చర ల్దాటి న్తర్వాతా యిక్కడా ఓ తసీల్దారుండె—ములుగులొ. ఆ యిండ్లల్లెవర న్నుంటున్నరా లేదా మాకు ఇన్ఫర్మేశ్జెయ్మని లెట్రొచ్చిం తసీల్దార్కక్కడ. అయ్తే యీ తసీల్దా రేంజేసిండు—యిక్కడ పద్మసేలీ లెవ్వరు చేనేతకుటుంబాలకు సంబంధించిన వాల్లెవ్వరూ వుంటనే లేరు......కలక్టరు వొచ్చిండు. ఒచ్చి నన్ను బిల్చిండు పిల్చి దీట్లొ యెవరుంటా రన్నరు. అయ్యా మేం— పద్మసేలీల వుంటానం. అంతా చేనేత కుటుంబాల వాల్లమె, మరిక్కడి తసిల్ద ర్చేనేత కుటుంబాల్వా ల్లెవ రుంటలేద న్రాసిన్రు గదా అనె. అందర్ని దీస్కొచ్చి నిలబెట్టిన్రు. నిలబెట్టి అప్పు డ్కలక్టరుండి యిక్కడంతా పద్మసేలీ లుంటాన్రు. చేనేత కుటుంబాల మనెక్క. ఇయ్యొచ్చు నిది అని కలక్టర్రాసిండు. పాకాల్కొన్ని రోజుల్పాటు అక్కన్నె వున్నయ్. తర్వాత ఒకా తొమ్మిస్సంవచ్చరా ల్తర్వాత మల్ల యిప్పుడు యాక్శన్పెట్టాని కొచ్చిన్రు. యాక్శన్పెట్టేసి— యెవరివ్వాల్లకూ యాండోవ ర్జరిగినయ్, అప్పుడు యెవ ర్లేరు.......నూ, నేను ఇద్దరం గల్సి కలక్టరాఫీసు కొబొయ్నం కలక్టరాఫీసు కొబొయి కలక్టర్కి దరఖాస్తు బెట్టుకున్నమన్నట్టు. మరి మీరేమో అప్పుడేమో యిండ్ల కాలీజేసివచ్చి మా కాల్నిలొ వుండమన్నరు. పన్లు గల్పిస్తమన్నరు. మరిప్పుడేమొ వెల్లిపొమ్మనంటాన్రు. అక్కడ వుండేవన్ని అమ్ముకో నొచ్చినరు. తీస్కొచ్చిన, అమ్మిన డబ్బంతా కతమయ్పొయింది. ఇప్పు డూక్జేస్కుంటూన్న ర్వీన్లు. ఎట్లాగనంటె—అద్గవర్మెంట్నిం చొచ్చిం

ద్మాకయ్తె యే మెర్గమన్నట్టు. సరేనీ అప్పుడు.....మినిస్టర్సుబగ్గరికోబ్బయి యీ యొక్కా విగ్నేపన పత్ర మిచ్చిన మన్నట్టు. ఇచ్చి దాన్మీద డ్రయెక్టర్కు రాసిండె యిది అమ్మటానికి వీల్లేదు. ఆఁ, ఇది సొసట్యీకి హేండోవర్జేసి యేదో విదంగ్జె సెయ్మనీ డ్రయెక్టర్యూక పన్లు గల్పిచ్చమని జెప్పినం. అయ్తె డ్రయెక్టరే జ్జేసిండు మాకు కుత్తగా సుసట్యీ బెట్టుకుంటే ఆ సుసట్యీకి యీ కాల్నొ లాగుంచేస్కొండెని. అక్కన్నించి చక్కగా ఆ డ్రయెక్టరందు కొప్కునుండె. డ్రయెక్టర్రాసిండు—ఏమని—వీల్లకు సుసట్యీ ఆర్గనైజేశనేస్కుంటే వీల్ల కాల్నీ అప్పజెప్పవచ్చునని. ఆ లెట ర్దీస్కొచ్చి కలక్టర్కిచ్చినాను. కలక్టర్గారికి త్తె కలక్టర్గారేమో మన డీవ్జనలాఫీసర్కు బంపిండు— మవ్వాబాద్కి. మవ్వాబాదాయ్న మాకు బంపిండు రిజిస్ట్రేశన్జేసుకోమని. ఈలోగా మేము రిజిస్ట్రేశ న్జేస్కున్నం. ఇంక కాల్నీ యాండోవర్గాలె, అట్లగె వున్నది. మొన్ననె యీ మద్దెన తీర్మానం గూడ జేసిన మ్మేం కాల్నీ మా కొప్ప జెప్పవల్సిందని అస్టెం డ్రయెక్టర్కి.

# వ్యవహర్త - 10 : బేంకు ఉద్యోగి

కేంద్రం : వరంగల్.          కులం : వైశ్య          వయస్సు : 24 సం॥లు

చదువు : బీ.యస్.సి          వ్యవహారఖండిక : పాకాలయాత్ర, బేంక్‌లోన్స్, ఉద్యోగం

బేంకువాళ్లమంటే జన్రల్గా అందరికెల్సినట్టు పొద్దున్నించి సాయింత్రం వరకు మాకు బేంక్లోనే సరోప్తుంది. ఇక్కడ బేంకు హానుమకొండ బ్రేంచ్కొచ్చి న్దగ్గర్నుంచీ యేదో వొక వారం యిక్కడ మా బ్రీ బ్రేంచస్నుంచీ ఫేమిలీస్తో యిక్కడ దగ్గరెక్కడక్కన్న యెక్స్కర్శ నెల్లాలననుకున్నం, అది కొన్నాళ్లకి— అంటే—మొన్ననే బ్రీపోర్డేస్కకు మేమందరం ఫేమిలీస్తో యిక్కడ్దగ్గరున్న, మువయ్నల్బయ్ మయ్ల్ల దూరమున్న, పాకాలెల్లడాన్ని స్చెయించుకున్నాం. ఎలాగో నా నా కస్టాల్బడీ దాదాపు తొమ్మిదిన్నరకి వరంగల్నిం చ్బాకాల్బయ ల్దేరాం. ఒక టూరిస్టు బస్సు మాట్టాడుకునెల్లేమండి. బస్సుకి యింకతను మా కస్టమరండి. అతనింకేం మాట్లాల్లేదు. తర్వాతేదో డిసయ్డ్ జేసుకోవొచ్చని వూర్కున్నామండి. సుమారుగా పెద్దలూ చిన్నలూ గల్సి నల్బయ్మందాకెల్లామండి. ఇక్కన్నించి పాకాజ్లేర్టానికి ఆ బస్సు బాగ పోతే దాదాపు వనవర్లో చేరేవాల్లం. కాని పాకాలుంకో రెండుమయ్ల్లుందనంగా ఆ బస్చెడ్పోయిందండీ. చెడ్పోతే అందరు కంపల్సరిగా నడ్చిపోవల్సివచ్చింది. ఫేమిలీస్తో వొచ్చినవాల్లు ఎందుకొచ్చామురాబాబూ అని చాల బాదపడ్డారు. ఫేమిలీస్తోరానివాల్లు సర్లే మనం ఫేమిలీస్ని తీసుక్రాలేదని ఆయిగా వున్నారు. తర్వాతెలాగో టూ మయ్ల్సు నడ్చి పాకాల్చేరుకున్నాం. పాకాల్చేరుకోవటంతోనే ఆ సన్డే యంజాయ్చెయ్యాలనోక్కనీ యీ నడువడమ్మూలానా అనుకున్నంతగా యంజాయ్చెయ్లేక్పోయాం. ఆకల్తోలా మలమల మాడ్తూ ఆకరికిట్టిఫినుకు వెయ్డ్జేస్తూవుండవలిసొచ్చింది. టిఫినిక్కడ్దీస్కెల్లలేదండి—ఇక్కన్నుంచి, అక్కడికొప్పోయిన్తర్వాతా ప్రిపేర్చేస్కొవొచ్చూచ అంతమాత్రానికెందుకూ వనవర్జన్నిగదా అని. అన్ని దీస్కెల్నాం. ఇద్దర్వంట మన్సుల్ని గూడ దీస్కెల్లేమండి. ఆడవాల్దాదాపు యెన్మిదప్పద్మందొచ్చారండి. పిల్లలు పద్పద్హేన్మందొచ్చారండి. పాకాల్లో—జన్రలు—బటానికల్టూరర్తైస్టూడెంట్సుకి హెల్ప్ఫుల్గా వుంటది. కని మనకంతగ మంచిది దగ్గర్లో యింకెదీ కనిపించలేదు. ఏదో మంచి లేకుంది. తర్వాతా పిక్నిక్స్పాటుగావెల్లి మనమేదో యెంజాయ్చేసి రావొచ్చని వుద్దేసెముంది. జన్రలెక్క వరంగల్లో వాల్లలాగ చేస్తుంటరు. అక్కల్లేదండీ. రామప్పలోనైతె దేవాలయముంది. పిక్నిక్స్పాటూ లేకుంది. కొంచెం ఫారెస్టేర్యా. ఇంటీరియర్సయ్డ్ కెల్తేమన్నా ఎనిమల్సునూ వాట్ని చూడొచ్చన్నావుద్దేసెంతో వెల్లేమండి. జంతువులు చూసే వోపికాలేదూ, మాకంత నడిచే వోపికా లేకుండబోయిందక్కడి కెల్లిన్తర్వాత. ఇక్కడ్జేరేటప్పడిక్క—

యిక్కన్నుంచి మొదలెట్టెత్తే—దాదాపు మూడు గంటలెట్టిందండీ. టయ్యం దాదాపు పదకొండున్నరగావచ్చుండీ. సాయంత్రానికి త్తిర్గొచ్చాం. చెరువుంది. ఆ చెరువ్జూసేం. లేక్—అప్సరస్సే అంటారు. అక్కడ విశేజస్సు పెద్దవేంటర్గాని డీటెయ్ల్గ్ల నాకు దెల్వదండీ.

బేంక్ల ద్వారా ప్రెజలకి ప్రవ్త్వం చాలారకాల్గా సహాయం చెయాలన్కుంటున్నది. దాన్కి అన్కున్నట్టుగా యేదో స్టెప్స్సుకుంటున్నది. కనీ, అనుకున్నంతగా సక్సెసు అవ్తులేవని కచితంగా చెప్పగల్తం. తర్వాతా మన పెజల్లో యీ బేంక్సు నేశనలయ్చ్చేసిన్దగ్గిర్నించీ వొక అయ్డియా క్రియేటయ్పోయింది. నేశన్లయ్జ్జేసిన బేంకునుండీ లిబరల్గా లోన్సెవర్తె తీస్కోనీ కో ఆపరేటివ్సో స్టియ్టల్ద్వారా లేకోప్తే యెల్లెమ్ప్బుల ద్వారా తీస్కున్నట్టూ, యీ కమర్శియల్బేంకు ల్ద్వారా గూడా లోన్సు లిబరల్గా పొందీ యేదో బేంకునజ్జేద్దామనే అయ్డియాగూడా క్రియేటయింది. ఆ మాట్లప్పడ్డింటుంటాం గూడా. కానీ తీరా వాల్లనుకున్నంత యీజీగా బేంకు నుంచి, యేనేశన్లయ్జ్డ్ బేంకున్నుంచీ గూడా, లోన్స్ పొందగలుగ్తులేరు. ఎందుకంటే బేంకువాల్లది గూడా తప్పనీ చెప్పలేము. ఎందుకంటే ఆ బేంకులో వుంది కంప్లీట్గా పబ్లిక్మనీ. ఎదో డిపాజిట్స్ రూపకంగా పబ్లిక్నుంచి తీస్కోనీ దానిక్సెక్యూర్టీగా వుంచవల్సిన బాద్యత బేంకదికారుల్మీదవుంటుంది. అలాగే బేంకునుంచి లోనిస్తే దాన్ని జాగ్రత్తగా కాపాడి వాల్ల డబ్బు వాల్లకుమ్మట్ట జెప్పవల్సిన బాద్యతుందిగావట్టి ఏ లోను కొరకు వచ్చాగానీ మేం సెక్యూర్టీ విశయంగా స్ట్రిక్ట్గా ఇన్సిస్ట్జెయ్ వల్సొస్తుంది. తీరా సెక్యూర్టీ క్రిటర్న కచ్చితంగా జెప్పేసరికీ నేశనలయ్జ్జు బేంక్సు అవ్జేస్తున్నాయ్ యివ్జేస్తున్నాయనో లేకోప్తే ఇందిరాగాంధీ జెప్పినట్టు చేస్తులేరనో యేవో మాట్లని పోవ్టం జరుగుతుంది. ఈ సెక్యూర్టీ విశయంగా గవర్న్మెంటు గూడా లిబరల్గా అంటే ఎలాపుటు దో అర్థంగావటల్లేదు. బేంక్సు ఫంక్శన్సంటే—మనగ్గరా రిజర్వ్బేంకుంది. రిజర్వ్బేంకంటే అల్మోస్టూ గవర్నమెంట్బేంకు. గవర్నమెంటుట్రాన్సేక్శన్సు. తర్వాతా మిగతాకమర్శియుల్బేంక్సునీ వాట్నీ కంట్రోల్జెయ్డం దానియొక్క విది. తర్వాతా యీ స్టేట్బేంకూ, స్టేట్బేంకాఫిండియా, స్టేట్బేంకు సబ్సిడియరీసు యివన్నీ గూడా రిజర్వ్బేంకి అనుకూలంగావుండి గవర్నమెంట్బిజ్నెస్సేస్తుంది. దానిక్చేసినందుగ్గాను కొంత కమీశన్ రిజర్వ్బేంకున్నుంచి లభిస్తుంది. అవి గాకుండా ఫోర్టీన్నేశన్లయ్జ్డ్ బేంక్సున్నాయ్. తర్వాత నేశన్లయ్జ్జు కాకుండా ఏ-క్లాస్బేంకుల్లో మిగిలిపోయిండ్దాన్ని ఆంద్రాబేంకొకటే. తర్వాతా, అంతకు ముందే బేంకులంటే కరెంటు డిపాజి—కరెంటంటే టరము డిపాజిట్లూ, టరమ్డిపాజిట్లలో ఫిక్స్డ్డిపాజిట్లూ, తర్వాతా రికరింగ్డిపాజిట్లూ, తర్వాతా డిమేండిపాజిట్లంటే సేవింగ్డిపాజిట్లు—కరెంట్ డిపాజిట్లు-యిలాంటివే క్సెప్ట్ జెయ్డం. తర్వాత టరమ్లోంచే, డిమేండ్లోంచే యీ రెండ్రకాల్గాలోన్సు పబ్లిక్కివ్వడం. అలాంటి చిన్న చిన్న విదులుమాత్రమే వుండేది. అంటే టరమ్లో

న్నంటే అగ్రికల్చర్లోన్సనోకండీ. తర్వాతా డిమేండ్లోన్సంటె మర్కెంటయిల్లోన్స నోకండీ, గోల్డ్‌లోన్సనోకండి, తర్వాతా యి క్లీన్లోన్సనోకండీ. ఇలాంటివుంది. అంతకుమ్మంద్ జ్బేంక్లో విదులుగా వుండేది. కాని యిప్పుడు కాలమ్మారినాకొద్దీ బేంకు యొక్క విదులూ తర్వాతా పజలయొక్క అవసరాలన్బట్టి బేంకింగు వ్యవస్తన్గూడా మార్చవల్సొస్తుంది. బేంక్లో అసలంతకుమ్మందు డిపాజిట్లూ, లోన్సే గాకుండా చాలారకమయ్న ఏజెన్సీ సర్వీసుల్ను ప్రవేసెపెట్టింది. ఆ ఏజెన్సీ సర్వీసుల్లో బిల్స్‌ను యాక్సెప్ట్‌జెయ్డం, తర్వాతా డిమేండ్రాఫ్ట్లనిశ్యూజెయ్డం, తర్వాతా యీ ట్రేవెలర్స్ చెక్సున్ప్రవేసె పెట్టడం, తర్వాతా యీ సేఫ్ డిపా జిట్లాకర్సన్గూడా పబ్లిక్కి ప్రొవయ్డ్‌జెయ్డం యెదో చీప్రెంట్లో వాళ్ల కన్కూ లంగా వాళ్లాడాక్యుమెంట్సుని గాని తర్వాతా ఆర్నమెంట్సుని గానీ బద్రపర్చు కోడానికి ఫెసిలిటీస్కల్పించడం, యిలాంటివి చాలారకాల ఏజన్సీ సర్వీసుల్న బేంక్సు ప్రవేసెపెడ్తున్నయ్. ఇంకా బేంకులు రాన్రానూ మారుమూలల్లోకెల్లీ ప్రతీ పల్లెప్రజగ్గూడా అన్కూలంగ వుండెటాన్కి బేంకులు కుశ్జేస్తున్నాయ్. సెక్యూరిటీ అంటే మాకు ఏదన్న బిల్డింగుప్రాపర్టీ అంటే యిమ్మువ్బ్ల్ప్రాపర్టీ యొక్క అబ్జల్యూటటయిల్డీడ్సనీ, లేకోప్తే యల్లయిన్సపాల్సీస్గానీ సెక్యూరిటీస్గ తీస్కుంటామండీ. తర్వాతా చిన్నలోన్సూ, మన్కియింటె గ్రెటీన్బట్టీ త్రీ తజ్జండూ ఫయివ్ తజ్జండూ అలాంటి వెవరన్నాకో ఆబ్లిగెంటూ గేరంటీ తీస్కోన్గుడా అడ్డప్పు యిస్తూంటామండి. అవునండి కష్టమరయ్యుండాలి. కష్టమర్కానప్పుడూ అతనియొక్క యింటెగ్రిటీ తర్వాత అతనియొక్క అంతస్తూ కేలిక్లేజ్జెయం కష్ట మవ్తుందండి. తర్వాతా యిమ్మువ్బల్ప్రాపర్టీమీద్నే యెక్కువ ప్రిఫర్చేస్తామండి. ఎంప్లాయీస్కయ్తే కచితంగ రెగులరిన్కమ్చూపెట్ట గలుగుతారు. తర్వాతవాళ్సేల్రీ ఫిక్సెడ్సేల్రీ వుంటుంది. ఎదో యింక్రీమెంట్లేడప్తూవుంటాయ్. ఎంప్లాయిస్కంటె దాదాపు ఫర్పర్చేజాఫార్టికిల్సని పర్సనల్లోన్సిస్తూంటామండి. పర్సనల్లోన్సంటే టుపర్చేస్రెఫ్రిజిరేట రార్సమ్ వెయ్కల లాంటి వ్గాడా మేమూ యెంప్లా యర్దగ్గిర్నుంచీ అండర్టేకింగ్లెటర్స్ తీస్కోనిస్తూంటామండి. అవున్నండి. దాదాపూ తర్టీ యిన్స్టాల్మెంట్లోస రికవరీ స్మేము తయార్చేస్తాం. తర్వాతా యెంప్లాయర్దగ్గర్నించి అండర్టేకింగెటర్దీసుకుంటాం. అండర్టేకింగ్లెటర్లో యెవ్రీ మంతిస్సాలెర్మండయ్రెక్ట్గ యెంపాయర్రెమిట్జెయ్యాల్సొస్తుంది. తర్వాత వెహికి లయ్తే వెహికిల్మ్కు బేంకుతో హయ్పాతెటజ్ చెయ్బడుంటది. ఇ కాంప్రెహె న్సివిన్స్యూర్గూడా చెయ్బడుంటదండి.

నేను వొక మామూలు కుటుంబంలో పుట్టేనండీ. తర్వాత నాకు డాక్ట ర్గావాలన్న వుద్దేసె ముండేది. అయ్తే నా కన్న ఎల్డర్ బ్రదరుండేవాడు. అతను సడన్గా పీయూసీ జదివి త్తర్వాతా యేదో ఫీవరొచ్చి జనోప్యాడండీ. చనిపోతే ఫయ్నాన్యల్ప్రాబ్లెమ్సాగ లేక మేము ఫోర్సిబుల్గా ఫేమ్లీని వరంగల్నుంచి కర్మ నగర్డిస్ట్రిక్ట్లో జమ్మికుంట అనే దగ్గిర్కి శిఫ్ట్ జెయ్యాల్సొచ్చింది. తర్వాతా ఆ వుద్దే

సేన్ని మార్చుకోని అక్కడే కంపల్సరీగ నేను బీయస్సీలో జాయిన్నాకవల్సి వొచ్చింది. బీయస్సీ అయ్పోయిన్తర్వాతా యమ్మెస్సీలో దాదాపు పర్సెంటేజీలో సీట్రాకా నేను టీచరుద్దోగంలో జేరాను. అ టీచరుద్దోగంగూడా పోతుందీ అన్న టయ్మ్లోనే నాకు యీ బాంకునుంచి రిటెన్టెస్టంతకుముందే రాసేను. దానికి యింటర్వ్యూకాలొచ్చింది. ఏ యిబ్బందిలేకుండానే యి ఆంధ్రా బేంకులో వుద్దోగం దొర్కింది. ఇప్పుడు బాగానే జరిగ్పోతుంది. ముందునాకు ఆంధ్రా బేంకులో ఫస్టపాయింట్మెంటు నానేటివయ్న వరంగల్కే యిచ్చారండి. తర్వాతా ప్రొబేశన్పీరిల్లో వుండగానే అక్కన్నుంచి బద్రాచలం దగ్గ చర్లా అనే బ్రాంచి ప్రపోజల్పెట్టి అక్కడ్కినన్ను ట్రాన్స్ఫర్జేసేరండి. ట్రాన్స్ఫర్జేస్తే ముందేదో కొంత బాదగానే వుంది. అయ్నాగాని తర్వాతక్కడికోచ్చయిన్తర్వాతా యెదో కొంచం ఆంధ్రా యేరియాగదా వాల్ల కల్చరూ, తర్వాత వాల్లబాశా నేర్చుకోటానికి వీలుంటుందన్న వుద్దేసెం కల్గింది. అలాగే అక్కడ్గూడ పెద్దిబ్బంద్లేకుండ గడ్చిపోయింది. ఆ చెర్లలో దాదాపు ఒ వన్నియరున్న తర్వాత మల్లీ యిక్కడ వరంగల్లో మెడికల్కాలేజీ బ్రేంచిక్ ట్రాన్స్ఫర్జేసినారండి, అక్కన్నుంచిప్పుడు హన్మకొండ్లో పన్జేస్తున్నానండి. బద్రాచలం అంటే పిల్గ్రిమ్యేరియా. ఉంటానికి వసతులు బాగానే వుంటాయండి. కనీ కాస్టాఫ్లివిం కొంచె మెక్కువ్గా వుటుందండి. ఆ యింటీరియర్ప్లేసూ అడిప్రాంతమేనండి. అక్కడ్మాకు టయ్మ్ పాస్కావ్టానికి యిబ్బందిగా వుండేది. బద్రాచలం ఎప్రి వీకోచ్చేవాల్లమండీ. టెంపుల్కు దాదాపుగ వొచ్చినప్పుడెల్లా విజిట్జేస్తూంటా వుండేది. బేంక్లో వుద్దోగాల్జేసేవాల్లకూ యిప్పున్నన్నడుగుతే చాలా డీసెంట్ ప్రాస్పెక్ట్సున్నాయండి. తర్వాతా యిప్పటీగ్గూడా ఇండేలో మా క్వాలిఫికేశన్స్కి మేం హయ్యూ పెట్టెంప్లాయిస్మనే చెప్కోవచ్చండి కచ్చితంగ. తర్వాతా, బేంకులో చేరిన్తర్వాతా సిన్సియర్గా బే.కోసం కస్టపడి యీ ఎంకరేజింగ్ ఎసర్జెగ్గా వుండి తర్వాతా యాక్టివ్గా వుండి ఫ్యూచర్కోసం తయారయ్తే మంచి బవిశ్యత్తుంటదని, తొందర్లోనే ఆఫీసర్స్ కావచ్చనే కాన్ఫిడెన్సుంది. నామటుకు నాకూ వొకా దాదాపో త్రీయర్లోన్స ప్రమోశన్తెచ్చుకోగల్గానని కాన్ఫిడెన్సు వుంది. ఇష్టమూ స్కేలంటే— నా బేసికొచ్చి టూ థర్టీనండీ. ఆల్టుగెదర్నాకు ఫోర్ఫిఫ్టీవరోకొస్తున్నయ్యండి. ఇవ్గాకుండా మెడికల్ యలవెన్సనీ, తర్వాత బోనస్సనీ, వోవర్టయ్మనీ అలాంటి అదర్బెనిఫిట్సుంటయ్. బెన్ఫిట్స గురించేం బాదలేదండి. ఆఫీసరయ్తే యిప్పట్పొజిశన్లో యిమీడియట్గాఫీసరయ్నాగనీ స్టార్టింగ్సేలరీ రఫ్గా వన్తౌజండ్వర్కూ రావచ్చండి. త్రీయర్స్లో వొస్తుందనే కాన్ఫిడెన్సుందండి. త్రీయర్స సర్వీసుంది. త్రీయర్లోన్స తెచ్చుకోగల్గు తననేకాన్ఫిడెన్సుంది. మాక్ బేంక్లో సీయేఅయ్యాయీబీ అనే ఎగ్జాముంటుంది. ఆ ఎగ్జాం పేసయ్తే విత్ఔట్సెనీ డిఫ్కల్టీ వియ్ కెన్బికం ...సీయే అయ్యాయీబీ అంటే సర్టిఫయ్డ్ అసోసియేట్ ఆఫిండియ నిన్స్టిట్యూ

టాప్ఫ్ బేంకర్సండి. అది రెండు పార్ట్సుగా వుంటయ్యాండి. పార్ట్‌వన్, పార్ట్టూ అనీ. ఇంటర్డిస్ట్రిక్టేగాకుండా, ఇంటర్‌స్టేటేగాకుండా త్రూవవ్టిండియాలో మా బ్రేంచెసె క్కన్నయో అక్కడిక్ట్రాన్స్వర్చెయొచ్చునండి. కనీ, జన్రల్గా వల్కిబ్బంద్పెట్టకుండా వాళ్లేరియాలో నుంచుతుంటారు. ఏమన గొడవలొచ్చినప్డు పనిశ్మెంట్రాన్స్వ ర్కింద ఆ ఎడ్వాంటే చ్తీసుక్కని మేనేజ్మెంటెక్కడి కయ్నా ట్రాన్స్వ ర్జెయ్యొచ్చు. క్వార్టర్సండీ? మా కుండవు. తర్వాత మా దగ్గరాఫీసర్సుగ్గూడుం డవు. ఆఫీసర్సంటె ఒకిన్చార్జాఫీ సర్సుకి మాత్రము బేంకుతో గలిపి యఛేచ్డ్ కార్టర్సుంటయ్యాండి.

## వ్యవహర్త - 11 : కూలిపనివాడు

కేంద్రం : మహబూబ్‌నగర్ కులం : యాదవ వయస్సు : 60 సం॥లు

చదువు : లేదు వ్యవహార ఖండిక : తిరుపతియాత్ర, స్వవిషయం.

ఇయాల యీ పని. ఆఁ. రేప్పనన్నది. రేపూ యిదే-పొజ్జుట్టూడ్చేపనుంది. పొకాల్ల ఓటల్పెట్టిరి. ఆయన్రమ్మన్నడు. ఇయ్యాల వడ్లు పట్టియ్యాలె. పుట్టె డొడ్లు. మల్ల...అక్కడేదో మీటింగున్నదట. రాత్రికి రావాలె అన్చెప్పి... ఇగండ్లకొచ్చియెసర్కి...ఎద్దెమ్మంటది. ఉర్కురా అదుగో ఇదుగో గిద్దేగద్దెమ్మంటే ......చిల్లర్చిల్లరజ్జేస్కున్నాగా న్నాల్గు మూడ్వొర్కుతది. ఇంటికొచ్చి పజ్జెయా లనేదుంటె ఆ యాత్రెండు, మూడు.

ఇక్కన్నె పెల్లెన్కున్నరు. నన్బిల్చిన్రు. అంతా సామానదియిదీ సదురుడూ చేసుడూ అవీ పన్లు జేస్న. బస్సులెచ్చిన్నయ్. బస్సులెత్తే యిగక్కడిగొచ్చియ్ అక్కడ్తిర్పత్లొ పెజ్జెయాలె. వాల్లనొక్కంటర్గద నరసిమ్మ మనందర్ల మంచిగ్మె దుల్తాండు. వీనిన్తిర్పతి గ్దీస్కపోవాలె. పనిగావాలెగదా? అన్చెప్పన్నడు. అయ్యా! మీదయ. తీస్కపోతే మంచిదే నన్చెప్పినేనన్న. నీకు కూలిత్తం. నీకు దారికచ్చు బెట్టుకుంటం. మాతోని అన్నం అంతా మంచిగయ్తుంది. రావాలేంటె సర్నన్నన్. మూటగిటగట్కున్న. బిత్తర్గట్కున్న. వాల్లతోని బస్సుకెల్నె. అన్నన్నడుగద మంది యెక్కువైన్రు నరసిమ్మ ఇగ నువ్వెక్కన్నె మనింటికాన్నె వుండు ఇల్లు గాపాడ్కొనుండు. మేంబోయొత్తం అనన్నడు. అంటేయ్న తమ్మ డన్నడ్గదా అక్కల్లేదూ. వాడ్రావాలె. వాన్నా సెపెట్నం. తిర్పచూపిత్తనన్నం. తప్పకుండ జూపియ్యాల. అజ్జెప్పి ఆ బస్సునిండంగనే గాడీమీద ఇక తొమ్మి దమ్మందిని నన్ను పద్మంది నెక్కిచ్చిపంపిండు, వాల్లూ మేం గల్సినం. పోయినం. ఆడ మూడ్రోజులున్నం. మంచిగ వచ్చినం. నాక్కర్చు బెట్టిన్రు. నాకు ముప్పై నల్ఫయ్ రూపాల్లు యిచ్చిన్రు. అక్కడ తానంజేసేది, దేవున్కి దన్నంబెట్టేదీ, ...జూసిన. నాక్సవరం జేపిచ్చిన్రు. సవరజ్జేపిచ్చేకాడ రూపాయా యెంతోయి చ్చిన్రు. ఒక నడ్డి గొనిచ్చిన్రు. ఆడో రూపాయో యెంతో యిచ్చిన్రు. ఆడాల్లు పిల్లలుజెల్లలు అందరు దిగి తానం జేస్తాండె. మజ్జమజ్జ నీల్తోడ్రా అంటె నీల్దోడ్తి. అయ్యన్ని జూపిచ్చిన్రు. అయ్యన్ని జూసిన. వాల్లతోని వచ్చిన.

బద్రచలం-మా బామ్మర్ది నేనూ మొక్కుబడుంటే-మా బామ్మర్ది మొక్కు బడుంటే-ఆయనా నేనూ యిద్దరం గూడి పోయినం. మొక్కుబద్రాయిచ్చు కున్నం. ఆడ కొబ్బర్కాయ్గొట్నం. ఒక రూపాయ్ కానిక బెట్నం. మా సుట్టాలుం డంగ సుట్టాలింటికాడికొచ్చియి మామిల్లమడుకొచ్చినం. మామిల్లమడుక్కొచ్చి అన్నించెల్లి ఇంటికొచ్చినం. బద్రచలం దేవునిగుడీ అవన్నీ జూస్నం. తానం

జేసినం. పట్లో తానం జేస్నం. సవరం జేపిచ్చుకున్నం. కానికబెట్నం. గుడికాడి క్కోభయ్నం. గుడీజూశ్నం. దేవుడిక్దన్నంబెట్నం. ఇగానిన్నించెల్లి మల్లా ఇంటి కొచ్చ్నం.

ఇంటొక్కొచ్చి కూలొన్నొల్పని మల్లేదన్న పెల్లిల్లు పేరంటాలు- మా ఇండ్లల ఎవ్వరింట్ల పెండ్లైన నాగ్గవళ్ళినోళ్లిలల్ల పెండ్లైతె పోటం. అన్ని మీదేసోక్కటం. అంటే అంతా ఎత్కోటం. ఎత్కోనీ కూరలూ బువ్వలూ పదిమందికిస్త పూత్తిగ మంచిగ జేపటం. వాల్లకు వొడ్డిచ్చటం. ఎవ్వరింట పెల్లైతైనా - వొంటాగింటా అంతా కూరల్నారలన్ని మంచ్గవొండి...

ఉన్నరు. యా బై మందున్నరు. గొల్లోల్లు. మేం పాలమ్మమండీ. బర్రె లుంటే పోస్తం. మాకు లెవ్వు. ఒక్కటే బర్రె వుండంగా జచ్చిపోయింది. నా చిన్నప్పుడున్నయ్. ఆవులేవుండె అవులూ వొందా రెండొందలావులుండె. ముప్పై ఎక్రాలిర్వయ్యెదెక్రాల పొలం, మా తాతా మా నాయ్నా మా పెద్నాయ్నా వున్నప్పుడు ఆవులుండె ఆవ్లూ పదెక్రాల పొలం రెండెక్రాల చెల్కాయియన్నీ పంటల్పండకా అన్నిడ్చిపెట్టేసిన్రు. ఇడ్చిపెట్టి ఇత్వరాసి పెట్టిన్రు. ఒక దొరవుండె. ఆ దొరన్బిల్చి...గారూ యిగ నాకు పొలంపండ దండీ. ఇగనాకు వీలుగాదు అని ఇత్వరాసి నువ్జేసోక్కయ్యా అన్జెప్పినంటె నేనట్ట జేసోక్కనన్చెప్పి ఆయ్న జెప్పిండు. చెప్తె, అవ్నా వొక దూడనిచ్చి రెండు గాల్పటోక్కని ఇత్వరాన్పెట్నం. ఇత్వంటె మా కొద్దు. ఈ పొలం మా కక్కర్లేదు. మే రకం గట్టలేము, అని దానం జేస్నట్టు. అదోభయింది. అదోభయ్నంక మల్లా తెల్వి కల్వోడెవ్డో వొక్డందుకొన్నడు. మా తమ్ముడు 'అన్న! నాయన్జచ్చె. తాతజచ్చె నా పొలం వుండె పలానాయిన్జేస్తుండె. మనం బంగపడ్డం. మనం దాన్కి పోటీ చేద్దాం'. అంటే వొద్దు తమ్మయ్యా! అబద్దమాడొద్దు. మనం ఆయేలిత్వరాన్పెట్నం. పోయింది. ఆయ్నెకర్కమ్ముకున్నడు. మల్లొకర్కిచ్చిండు. ఇండ్లా ఆయ్నబావ. ఇగ ఆయన్తోటి మనం నిట్టూరం బెట్కుంటే బాగుండది. మనకేం వొద్దు. మనకు రెక్కలే వున్నయ్. మనమే వున్నం. అన్చెప్పనుక్కన్నం ఇంతలే నాయన్జచ్చిండు. నాయన్జచ్చేక పెండ్లయింది. పెల్లిగాంగనే ఆన్నించి కమ్మంబోయ్న. కమ్మంలో ఒకనెలా రెన్నెల్లు మూన్నెల్లు పన్జేస్న. ఆన్నించి మల్లవొచ్చిన. మల్లా వొచ్చి మల్లాకొన్నిరోజ్లాన్నెవున్న. ఆన్నించి మా బావ దిసొక్కచ్చిండు. మా బావ దిస్కొచ్చి యిక్కడ గిరిన్ల పన్జెప్పిన. రోజు పావ్ల కూలి. ఒక యేడాది రెండేన్లు జేస్న. ఆన్నించొభయి అమాన్పన్జేస్న. అమాన్పని పోయింది. చేతగాకోప్వటం ఈ కూల్పనిమీద బడుటం. ఆ వొక్కకొడ్కుతోనె జీవ్యాత్ర గడప్తాన్న. ఇక నేను పొద్దునాన్కపోతె రెండో మూడో దొర్కితె...పదిమందిజనం. ఇప్పుడ్కాల్సె ఉంటానం. ఇలా ఒక్క రెక్క మీద్కెల్లి కూరల్నారల్దెచ్చుక్కంట, యీ పన్జేస్కుంట పోరుగూల్లమ్మద్గానీ చుట్టాల్గానీ, పక్కాల్దానీ పెల్లిల్గానీ పోతా వస్తా. ఇకట్నాలంటె - నేనున్న, మా

బావున్నడు. బావ యింటపెల్తైతె నేను పది జద్విన. అంటె గుత్త కాదు. ఉద్ది. ఇష్టం. ఇష్టంతోని మా బావకు పది జదివిచ్చిన. మా బావ ఇరవై జదివిచ్చిండు నా బిడ్డపెల్లికి. ఇగ కట్నాలూ—నాల్గూ మూడూ అయ్దు రూపాయలు. వొందల్గాదు. ఇగ నాబిడ్డపెల్లి. ఆడపిల్లా? ఇచ్చే అల్వాటూ? ఊరగర్చు రూపాల్లు పన్నెండు రూపాయ్లూ యిర్వైనాల్గు రూపాయ్లు యిచ్చిన్రువాల్లు. ఇగ మనం నూట పదార్లు నేనిచ్చె. నూటపదార్లు నాబిడ్డకిచ్చి అల్లునికిచ్చిన. బిడ్డనిచ్చిన. ఇస్తై మల్లా ఓ పాలియేజ్జేసిందూ? సముత్తయింది. ఈ సముత్తయ్నప్పుడు నాకట్నం రావాలని కొట్లాడిండు అల్లుడు. కొట్లాడ్తై మల్ల రెండొందలిచ్చిన. ఇట్లైనె పదీ అయ్దూ. అక్క వున్నది గూడేంలో. అక్కవున్నప్పుడూ "తమ్మయ్యా! నువ్వు నాకు కన్నతండ్రివి. నువ్తమ్ముడవ్నెనక్కనూ. నాకు అవుస్దగ్గరొక్కచ్చిఁదిగనేన్బతొక్క. ఈ పిల్లాద్నీస్కపోయి చాదుకోని నీ బిడ్డని పెల్లి చెయ్యన్నది. సర్నెనుక్కన్న. ఆ లెక్కమీత్తీస్కొచ్చిన. చాదినా. సవరిచ్చినా. పెద్దోజ్జేసినా. వాల్వీల్లన్నరుగదా మేనోడికియ్గూడ్దు. వానిక్సెల్కలేదూ. పొలం లేదూ. ఇయ్గూడ్దు. అన్నరు. చి. ఇయ్యకుంటే బాగుండదీ. నేను నా ఆల్లుడ్కి పిల్లన్మాట్లాడబోత. పిల్లన్మాట్లాడబోతే ఏంగావాలీ అంటరు. అల్లుడూ అంట. అల్లుడూ అంటే మర్నిక్పిల్ల లేరాంటరు. ఉన్నరూ అంట. మర్నివ్వొందుకియ్య లేదూ అంటరు. ఆఁ? వానిక్సెల్కలేదు, బూమిలేదు. మరిమేమెట్లిత్తం? అని అన్నకాడికొస్తది. ఇగ ఒకర్తోన్బుద్ది జెప్పిచ్చుకునేతనంగాదు. మనం కూల్నాజ్జేసుకునే బత్కడం. వాడూ అట్టాగే బత్తకడు. వాడు పబుద్దుడౌతడో, వాడ్చంపాయించుక్కంటడో—వాడేమన్న జేస్కోనీ. అల్లున్కి యియ్యాలజెప్పి నేనన్న. నా బామ్మర్దిన్బిల్పిచ్చిన. పిల్పిచ్చి నీ అక్క యియ్యనంటాంది. ఆన్కేంలేదంటాంది. మరియ్యకుంటె బాగుంటాదనంటె—బావా నీకు దన్నంబెడ్త నువ్వట్లాగ మమ్మజ్జాదినవ్. సవ్రిచ్చినవ్. నీ మాట నే వినకుంటనా? మా అక్క తప్పకుంట యియ్యననాగాని మేమిప్పిత్తం. అల్లునిక్పెల్లి చెయ్యాలన్నడు. చేసిన. చేసి, మనింటనే వున్నడు. మనింట్లనే వుండి, ఒకరిగ్గీతముండి, జరమొచ్చింది. అత్త మందుల్బెట్టిందన్చెప్పి వాడొపుకాజ్రేసిండు. పుకాజ్రేత్తే, సరే, మందుల్బెట్టింగ్గదాన్చెప్పి వాల్వీల్లూ...నువ్వట మందుల్బెట్టైవట అటయిట్ట ఆనంటె - నాతోనొచ్చి ఏమయ్యా! మీ అల్లుడు గిట్ట జెప్పిండట. నీకేం బయంలేదే. పాపంలేక్పోతే బయమేమీలేదు. నువ్వైతె వూకోమనన్న. అన్నాక పద్రోలకే పోయిండు. పోయ్ కమ్మంలో వున్నడు. కమ్మంలో ఓటల్లో పజ్జేసిండు. పజ్జేసీ, ఆర్నెల్లకొచ్చిండు. అల్లుడె. ఎవ్డో ఏట్లో జచ్చిండటా పాపం! అన్చెప్పంటె అయ్యో మా అల్లుడు గిట్టనా అజ్జెప్పంటె మా వొల్లకు చుట్టొచ్చింది. చుట్టొత్తె ఏందే చుట్టంటె ఏమో ఎక్కనొన్కె ఎవ్డో చచ్చిండంట. అయ్యో! అల్లుడ్బాయె! అన్చెప్పి అనొక్కంగనె తెల్లారె అల్లుడవ్డడు. అల్లుడౌ పడ్తల్కె సర్నెజ్జెప్పి మీ అస్మంటి పెద్ద మన్సులకు...చిన్నాయ్న పెద్దాయ్నవుండె వాల్లన్బిల్సొచ్చి ఆడన్నిలబడ్డడు. ఏమి నర్సయ్య! నీ అల్లుడాయె. సరె, ఏదో పోయిండు. నీ

మీదా యేదో లేనిపోనివ్వెట్టిండు. పోయిండు. ఒచ్చిండు. మర్నువగ్గిర్దియ్యాల్న న్నరు. అంతే, నే దగ్గర్దియ్యా. వాడిట్ట దూరం జేసోయిండు. నేనగ్గర్దియ్యా. ఈ బిడ్డనింకొకర్కి స్త. అన్చెప్పి ఆ పద్మంది ముంగల్నన్న. నా భార్యముంగలైన నా బిడ్డముంగలైన అంతే. వాన్చాటుక్కిబ్లిచ్చి చెప్పేన్గదా, అయ్యా! నువ్వోబ్బయ్ పిల్లగాన్నెత్కోక ఓ పాలి పైసలియ్యి. అప్పుడో యిప్పుడోచ్చి మంచినీ ల్దాగు. అంతా అల్వాటయిద్ది. మల్లి చిన్నంగ ఇన్లకే రావొచ్చు. అని వీల్లముంగలేమొ ఒద్దన్నట్టు, ఎన్కనేమొ రమ్మన్నట్టు. అట్ట రప్పిచ్చిన. అమానప్పన్గొగ్గుదిర్న... గారికప్పజెప్పేస్తే పెద్దెత్తున తిర్గేటోన్ని. మేస్త్రి అయ్న. తిరిగీ పడికోబ్బయినా పడొక్కచ్చినాగా న్నే జెప్పినట్టా పదిమందినేది. అంతలో అల్లున్ని దిస్కున్న. మరి అల్లున్కి జాగ వున్నది. పలాన్దుకున్న. మరి అద్దర్జేస్పెట్టాలన్న. సరెనన్నడు. ఎంత రెండొందలెనబై రూపాల్లయింది. ఇగ...దగ్గర దాయబెట్న వొంద రూపాల్లు. కొంచబోయిండు. ఈ రెండువొందలయెన్బై రూపాలూ యిప్పు డొంద యిస్తాన్గదా. ఇగ నూట యెన్బయ్యంటయ్గదా. నూట యెన్బయ్ వడ్డీ వాల్చ లేకుంటా నా అల్లుడు నెలకు పది యీ పన్జేసి తీసేత్తడు అనంటె సరెను అన్నడు. ఆ లెక్కమీత్తీస్కున్నడు. తీస్కున్నంకా నీకాల్ని కాల్మంచ్మంచో ల్కాల్పటోక్కని వాసాలడ్గిన. ఓ మూడు వాసాలడిగి ఇల్లు నిల్వోట్టిన. గోడవెట్న. కొమ్మ బెట్న. ఇండ్లదోల్న. ఇండ్లదోలి-బిడ్డా, అల్లుడూ - ఒకకొడుక్కు బుట్టిండు. వాన్కి యింత కండు రుమాల్బెట్టి, నల్బైరూపాల్కర్చబెట్టి ఇంట దోల్న. ఇండ్లలకొచ్చిను. వాల్లంతట వాల్బత్కాన్ను. వాల్లంతట వాల్బత్కాలంటె - జబ్బులో దగ్గులో గిశ్నే అయ్తాంటచ్చేస్తాంటది. ఒచ్చిను. మల్ల పద్రోజులామ్మ యింటికాడ వున్నది. ఉండి యెన్నాల్లున్నా దప్పదు గద. ఈ పెద్దమన్సాపెద్ద మన్సుల్గోడి చెప్పాల. ఎన్ని జెప్పినా గాని మావా నాత్తప్పయింది అన్చెప్ప న్నడు. తీస్కపోయిండు. వాన్పెల్లాన్వాడ్బాదుకుంటానడు.

## వ్యవహర్త-12 : వ్యవసాయదారుడు/రోడ్ల కంట్రాక్టరు

కేంద్రం : జనగాం, కులం : హరిజన్ వయస్సు : 50 సం॥లు

చదువు : లేదు. వ్యవహారఖండిక : కాంట్రాక్టుపని, వ్యవసాయం, హరిజనాభివృద్ధి

నే న్రోడ్మీది కోవ్రత. పబ్లీకు న్దీసుకొత్త. రోడ్మీద సైడ్మీద న్నిలవెడ్త. లైనిత్త. సక్కగ లైనిత్త. మర్కోటిత్త. అందర్ని లైన్బట్టిచ్చి మన్నుబోయిత్స్న. మంచ్గ సైడ్మీద పెల్లాగిల్లా లేకుంట సుబ్రాగ పల్గొట్టిత్త. పల్గొట్టిచ్చి మంచ్గ డెస్సింగ్జేయిత్త. సూపర్వైజర్లూ యెవలొచ్చినా, బీడీవోవొచ్చినా వాల్చూల చక్కగా వున్నదని సూసేతట్టుగ చాన పెయ్త్నంజేసి చేయించ్త. గడ్డపార ద్దీస్కొత్త. తట్టలు. ఆటి కొమ్మిన ల్బెట్టిత్త. పార ద్దీస్కొచ్చి యెత్బెట్టి అక్కడ దూరాన యెత్తి పోయిత్స్నమన్నట్టు. మూడు గజాల యెడల్పెడ్తం. దాన్పక్కనించి మల్ల రెండు గజా లెడల్త్పోటి కోబ్బెడ్తం. రెండు పీట్లలోద్దవ్వుతం—ఆర్పీట్ల యెడల్త్పోటి అయ్యి అక్కడెక్కల్లెత్తి ఆ సైడ్మీద మంచిగ పోత్తమన్నట్టు. అయ్తె అక్కడెక్కల్దానితోయిత్స్నం. మంచ్గ సుద్రగ్బెట్టు, యేంలేకుండ సుబ్రగ్గొట్టేసీ యేమన గుండ్లు యెవన్నా అడ్డమొస్తె అయ్యన్నీ తీసేసీ ఆ గుండ్లు గిట్ల దీసేసీ యిగమంచ్గ చక్కగ వుండేతట్టు నీల్లూ గీల్లూ బోసీ యేన్నా గట్టి పెల్లలుంటె నీల్లోబ్సగూడ పల్గొట్టి మెత్తగ పొడిపొడిగ జేసి దాని మంచిగ డెస్సింగ్జేసి యిటూ అటూ జారుడుండేతట్టు నడిగొల్గ మిద్రొచ్చేతట్టు మొరం గూడ తీస్కొచ్చి బండ్లతోటి కన్సులుగత్తం. నడిరోడ్డుమీద ఒక ఆరించులెత్తుతోటి పోసి దాన్మీద మల్ల నీల్లు జల్లి ఒక రోలర్ యేసి తిప్పుతం గట్టిగ అనిగేతట్టు. గట్టిగ పయత్నజ్జేసి దిమ్మినల్త్తోటైనా, దిమ్మిసల్గాకున్నా రోలర్ యేసి తిప్పుతిత్తం. తిప్పు తిప్పి మంచ్గ అన్గేతట్టు అన్గకొప్తే మల్లొక్కవర్స నీల్లు వట్టిత్తం. మల్ల రోలర్ వేసి—మనుసుల్కు సాజంగాదు-పసుల్గట్టి గుంజిపిత్తం. తెల్లారగట్ల నాలుగ్పసుల్గట్టి అ రోలర్గుంజుడు. నాలుగ్మాట్లక్కడి కిక్కడి తిప్తం. ఎక్కడెక్కల్లెస్తుంటె అక్కడక్కడ ల్నిజ్జల్తావుంటం. అంతకంటేంలేదు. రోడ్డంతా దాన్కొవునాదీ వుంట ద్వొందపీట్ల పొడవ్తోటి. ఒందపీట్ల పొడావ్లో వాల్లు ఆరడ్గులలోతు దీయిత్స్నరు. దాంట్లో రెండడుగు ల్లోతున కంకరేయించ్తరు. రెండడుగుల యెత్తు కంకరేయించ్తరు. ఉస్కె సిమ్టీ కల్పి కంకరమీద మల్ల నీలోబ్సుక్కుంట కల్పి అన్లేసి దిమ్మిస గొడ్తం. అయ్దుగురుప్పరోల్లుంటరు. పదిమంది ఆడోల్లు ఒకా యెనమండుగురు మొగోల్లు. కంకరెత్తటానికి...పద్మెందేంది? మొత్తమ్మిప్పైమంది, యిర్వై మందేడోల్లుంటరు. ఒకప్దమ్మందొమ్మగోల్లుంటరు. అయ్దుగుర్మేస్త్రిల్లుంటరు. మొత్తం యింత మందితోటి దాన్నేస్కుంటా దిమ్మిస కొట్టుకుంటా రౌతు యేస్కుంటా మంచ్గ కట్కుంటొకలేవెల్లో. మెట్నవుంటది. ఆ మెట్నవెట్టి యెత్తు లెవుల్క

ల్పుకుంట. అక్కడ్కిక్కడికైపైన-వాల్లిచ్చిన యెస్టిమేట్ప్రకారంగ-గవుర్మెంటు
సూపర్వైజరిచ్న యెస్టిమేట్ప్రకారంగ. ఆలెవెల్లగల్పుటం. దాన్లో ఒక్క లెవెల్గ
గుండుకు ఒక్క లెవెల్దీస్కొత్తం. తీస్కొచ్చినత్తర్వాత సూపర్వైజరొచ్చి మొద
ర్లికాడ్జేత్తడు. తొవ్వి సూస్కుంటడు. మాల్సరిగ్గున్నదా లేద సూస్కుంటడు.
నీల్లు యెయ్యాలనాంటడు గట్టిగ వుండేతట్టు. అని తోయిత్తడు. తోయించి
అజ్జాస్కున్నంక అయ్యొన్నచ్చి రికాడ్జేస్కుంట డంత. ఏయిన్దీస్కొత్తడు. ఏయీ
సాబు స్టీస్కొచ్చి-యింజనీరు స్దీస్కొచ్చి-అక్కడ సూయింత్తడు. సరిగ కరెక్టు
లెక్కగు వాల్లెస్టిమెట్లున్నట్టుగ సుయ్యింత్తడు. సరే, యస్సని సంతకజ్జేత్తడు
యస్సన్టిక్కుల్వొత్తడు. పెట్టినంక మాకు మల్ల దీస్కొచ్చి మాకైప్లైజేత్తడు,
రాత్తడు. సూపర్వైజర్రాసీ సంత్కం జేసీ సీ సీర్లాత్తరు. సీ సీల మీద మాసంత
కాల్బెట్టించ్కుంటరు. సీసీ పారమనుంటది. దాన్మీద పదిపైసల రసీట్టికెత్బెట్మ్రం
టరు. రసీట్టిక్కెత్బెడ్తం. ఆ టిక్కట్మీద బెట్నంక వీల్లంతా రాసిన యెస్టిమెం
ట్మ్రం జేసిన పనం తన్ల రాత్తరు-ఎన్బిలో. ఎన్బిలొ రాసీ, సీ సీలో రాత్తడు.
అ యెగ్రిమెంట్బాడ్మీద రాత్తరు-స్టాంపుమీద. దాన్మీద రాస్నంక సీ సీ ల మా
పైసర్లాత్తడు. అది బీడీవో దగ్గర్బంపుతడు. బీడీవో సంతకం జేత్తడు. మల్లా
మేనేజర్దగ్గరకబంపుతరు. మేనేజర్సంతకం జేత్తడు. ఆతల్సెక్శన్లో బోయ్నంకా
ఆకౌంట్సాబ్బిల్లు జేత్తడు. అకౌంట్సాబ్బిల్లూ అంతా టోటల్జెయ్యంగనే మల్ల
బీడీవో దగ్గరొస్తది. బీడీవో సంతకజ్జెయ్యంగనే చెక్కు రాత్తరు. ఆ చెక్కు మల్లా
అకౌంట్సాబ్మాకప్పంపిత్తడు. చింపియ్యగనే మల్ల మేం బీడీవో సాబ్దగ్గరకీస్కొ
నొప్తం. ఆయనెదట్లో మేం సంత్కం బెడ్తం. మా యెదట్ల మల్లా ఆయనస్సం
త్కం బెడ్తడు. దాన్మల్ల దీస్కొర్నాంగనే బీడీవో ముద్దెర గుద్దుతడు. ఆ ముద్దెర
గుద్దగనె యస్టావ ఆఫీసుకోస్తం. యస్టివోన్ల సంతకాల్జేత్తడు. మల్ల మమ్మల్ని
సంత్కం జేయించ్కుంటడు. అక్కడ్కెల్లి బేంకుపోతం-స్టేట్బేంకు. స్టేట్బేంకు
పోంగనే అక్కడ ఆల్లు మాకు బిల్లయిత్తరు-చెక్కు నెంబర్రాస్కొని. అ బిల్ల
యిచ్చినంక యిర్వై నిమ్సాల్గూచుంటం. ఇర్వై నిమ్సాలకూ ఆక్కడ్బిలుత్తాడు.
పిల్వాగనే పోతను. పోంగనె ఆ బిల్ల యిచ్చేత్తను. ఇచ్చెయంగనె పైసలిచ్చే
త్తరు. వాల్లద్వేలేస్రి యస్టిమెంట్లో. మనకూ రేట్లుంటయ్. లేవర్కు ఆడోల్ల
క్రుపాయిన్నరిత్తమూ, మొగల్లక్రెండున్నరిత్తమూ. అద్గవుర్మెంట్రేటు. పోతే,
యేడ్రూపాయ్లూ వుప్పరాయనకిత్తం. (గవుర్మెంటు) వాల్లూ తొంబయీ
యెన్బై రూపాయ్ రోజ్కిట్కాని కిత్తరు. ఇత్తె, వుస్కె, సిమింటంత మేమె
యియ్యాలె. అంత సీమెంటుస్కెంత మేమె తెచ్చేట్టాలి. లేగోతె గుత్తకిచ్చాన
మేత్తిర్కి మేము యిర్వైరెండు నించి ముప్పై దాకిత్తం. ఇత్తె మాలు, రాతు
మే మందియాలి. ఈ తొంబై చొప్పిచ్చానగాని మేం దగ్గరంచ్గ కష్టపజ్జేస్తె ఆ
తొంబైలో పదీ అయ్దూ మిలుత్తయ్యన్నట్టు. ఈ దీన్ప్రకారంగ యిట మేము
చాల మందిన్బెట్టి దవ్వజ్జేయించ్కుంటె మాకు రోజ్కు యెన్మిద్రూపాయ్లు,

తొమ్మిద్రూపాయ్ల్, పద్రూపాయ్ల్ (కూల్కంటె) యెక్కువ్వడదు.

నాకు యెకరన్నర తరున్నది. నాలు గ్సంవచ్చరాల్నిం చ్కాలం బొయ్యాచ్ల కస్టపడ్డామనొక్కండి. కని కాలమైతె మే మెక్రాన రెండు పుట్లొడ్లు బండిత్తం— యింతక్ముందు. అప్పుడు రెండు పుట్లు బండిచ్చేది. ఇప్పుడు యూరియా యీ అమ్మోనియ సల్ఫేటు యిదొచ్చిన కాడ్కెల్లి మంచ్ఫంటేసి దన్మెక్కె యెక్రాన హంసవెట్టి అర్ధ్ పుట్లూ, నాలుగ్పుట్లు దాక్ఫండిత్తం. ఆర్కింటాల్లైతది—ఒకపుట్టికి. ఇంగ యిట్ల పండిత్తం. అంటె దాన్నె మంచ్గ నాలుగ్సాల్దున్తం. ఒడ్డొరం బెడ్తం. మంచ్గా కలమేత్తం. మంచ్గ మురగబెడ్తం. నారుబోత్తం. అనారోజు కార్తెల్లో, రోని కార్తెల్లో నార్పోత్తం. మంచిగ పొలమ్మురగంగనె నాలుగ్సాల్దున్ని మురిగ్నప్పుడు ఈ అలమంతేస్తాక్కె పెండేస్నె మంటె తర్వాత పల్సగ పిండ్జల్తం. ఎకురాని కొక సంజల్తె మీ కోరమండలం. సల్లి ఆరించు ల్మొడించు ల్మందంతోటి అక్కడో మొక్కక్కడో మొక్క నాటువెడ్తం. అది పచ్చవడ్గనె తొడగల్ఫదీత్తం. ఇంగ్దాన్వల్లి గట్లనె పంట గూడమ్మంచ్ఫంట. ఆర్నెల్లకూ ఒక పంటొస్తుంది. రెండు పంటల్ఫండిత్తం. ఒక పంటా సాంబ పెడ్తుంటం-సాంబా, అంసలు, యీ మసూర్సాంబలూ. ఒక పంట పతేకంగ మైల కమ్మొ, తెల్లంస వెడ్తం. ఇగ చెల్కల్ల మాగిజొన్న. కని చాల పంటల్లేదన్నట్టది. పూనా జ్జొన్న. నా చెల్క రెండెక్రాలు. ఈ అద్దాలూ యెక్వదీత్తున్న మీ రెండెన్లనుంచి. ఆద్మాల పంటలూ ఎక్రాన నాలుగొందలూ, అద్దొందలూ దర్లున్నగ్గదా? ఎక్రానా రెండుకింటా ల్మొడిక్కంటా ల్లైత్తే రెండు కింటాలెత్తే అర్దొంద ల్రూపాలవ్తుంది. ఈ రెండు సంవచ్చాల్నుంచీ, మూడ్సంవచ్చరాల్నుంచీ యెక్కువ్ఫంట దీస్తలేం. ఎందుకంటె సరైన కాలమైతలేదు. దాని కదనగాకా చెడోఫ్తుం దెబ్బదింటుంది. కంది పంట మంచ్గ నెల్తుంది. ఉలవ్ఫంటలు మంచ్గ నెల్తునయ్. బోతే యింకా నువ్వల్గూడ జెర్దెబ్బతింది. జొన్నపంటోటి యెల్తుంది. మంచ్గ యెక్రానా పందుం జొన్నలెల్తయ్. పుట్టెడయ్తె యెల్లయనొక్కండి. మక్కజొన్నల్గూడ మంచ్గనె- మడిక ట్లకక్కడక్కడేసి మక్కజొన్న పంట గూడ మంచ్గనె తీత్తం.

మనకూ యీ నైజా నవా పోయినాక్కడ్కెల్లి, మన ప్రవుత్తమొచ్చిన కాడ్కెల్లి, మన భారద్దేసె మొచ్చిన కాడ్కెల్లి: మనదేసెంలో కొంచం యెక్కువ హార్జన్ను చాలా ముందుకొచ్చిన్రు. కానీ దానికి సరైన పద్దత్లో కంట్రోల్లో గవ్మెంట్ఫటోక్కకా చెప్పటం వరకు హార్జన్సులకు యియన్ని సహాయం జేత్తున్న మనే వరకే కాని హార్జన్లకు సరైన లాబదాయక్కలూ యింక యింతవరకింకా అందలేదన్నట్టు. అందుతలేదు. అందలె. మొత్తంల హారిజన్సులెట్ల వున్నమంటె దేసెంల భారద్దేసెంలో యెలక్సన్లు శురువైన కాడికెల్లి కొంచెం అభివృద్దైంది. భారానా మంద మభివృద్దైన మన్నట్లై. అన్ని అబ్రుద్ది అయ్నంగని, యిక్క లీడ

ర్లెట్లున్నరంటె అన్ని పదవ్లకి వాళ్లె. వాళ్ళమ్యాన్యూలంగ మమ్మ్ము లుప్యోగించ్కోని వాళ్ల్రాజకీయమంతా మంచి సోమర్తంత వాళ్లె, లాబ్దాయ్కాలన్ని వాళ్ళంపా యించ్కున్నార్గని మాకేం అందుబాట్లో యింక కాలేదని ప్రబుత్తానిక్మేం చాలా యెదుర్సూసుడం జరుగుతుందింక. ఎంద్కంటె మా కింకింత సహాయంచేస్తదో, మమ్మల్నింత పైకి దీస్తుంతోన్గాని అందుక్జూత్తున్నంఅనీ వాళ్చెప్పే మాటల్కొ రకూ అనుడుమే గాని ప్రబుత్తంగూడ మంచి సహాయం జేస్తుంద్గాని మా దగ్గరా సోమతలేక మేము లబించుకోలేక పోతున్నం. పతీ రాజకీయ లీడరు— ప్లాన్సు వేసి ఒగా కాలేజి, ఒక గవ్నమెంట్ ఆస్పత్ర్బెట్టి మీ పిల్లలందర్సదవ్వాలి. ఆస్పత్లె గవర్మెంటన్నం బెడ్తుంది. అక్కడ్సదొక్కవాలి. ఇక్కడ హాస్టలుంటది. అక్కడ్బ డుంటుంది. బడ్సీ ల్లేదు. మీకు వుజ్జోగా ల్మంచ్గ దొర్కుంటె వుజ్జోగాల్మేం సహా యంజేత్తం అనీ మాకు సహాయం జేత్తుందెంతొ. అయ్తె మేం చాలామందిం పయ్త్నం జేసట్లు జద్వుతునే వున్నం. మాకు జర్గుతునే వున్నయ్ కొన్ని. కానింక— యెక్వ జర్గాల్నని మా కోర్కె. దేసెంలో మంచి బూమ్లున్న వాళ్లె లబించుకున్నార్గనిక్క బన్కిరాని యున్నయ్ గన్క ఆయిట్ని మా కిప్పుడు మా కందుబాట్లో జేసిన్రు. మాకు పట్టాల్గాడిచ్చిన్రు. ఒకొక్కక్క యిర్వైయెక్రా లల్లొ చేవెల్సు అన్ని పద్వేలు పద్హేడ్వేల్బెట్టి బాయ్ దవ్విచ్చిన్రు—గవ్మెంటు. దాన్ని తొవ్విచ్చి కలెక్టర్నించి కరెంటీ సప్లై చేయించిన్రు, వైర్గిర్యు ఫ్రీగ్జేకుంట. ఉచ్చితంగ కరెంటుమోటరిచ్చిన్రు. పైపులిచ్చిన్రు. తయ్నల్నించి గిట్లపైపులోమోటర్లు దాన్కి యెడ్ల జతలు కొనిచ్చి సరైన ఒగా సూసైట్పెట్టి దాన్ని మాకు కొన్ని తానాలల్ల సహాయంజేత్తానె వున్నది. చేత్తుంటె మేం కొంచెం బాగ్పడ్తున్నం దానివల్ల. ఇప్పటిగూడ యింక యెక్వ మాక్సహాయం జెయ్యాల్నని ప్రబుత్తా నిక్మేం……

మా కొత్తపల్లో యేం యిండ్లు లేవనొక్కండి. జన్గా తాలూకాలో గట్టిచ్చిన్రు. కల్లెంలో అర్జన్సక్క కోటర్స్ గట్టిచ్చిన్రు. ఇక్కన్నెజన్గం పక్కకుం టది. గూడెల్లో ఓటిగట్టిన్రు—కోటర్సు. గూడెల్లి యీ జన్గాంతాలూకాది. లింగాలగనపురంలో ఓటిగట్టిచ్చిన్రు. కట్టిత్తమని తెసీల్దార్గూ డొచ్చిండక్కడిక్క ఒత్తె మా అర్జెన్సె వొపోక్కలె మాకేమొద్దని. ఉన్నవాల్లేం గదు. కని మకెం దుకూ ఆ కోటర్సులు? ఆ రూపాయి ల్మాకిత్తె మేం గట్టునే పాస్తిర్గ కడ్తుంగానీ, వాల్లెస్ట్ మేట్ప్రకారంగ మంచిగుండ ఝ్యటొ గల్వా టోగల్వానీ ఆ వుద్దేసెం తోటీ. ఇయ్యర్గద. నే నక్కడ్కన్న. పయ్త్నం జేస్న. నేన్తెయ్సిల్దార్నబట్కొ నోవ్వయి పయ్త్నం జేత్తె…… సూశల్వెల్ఫేరాఫీసర్న గూడ్దీస్కబోయ్న. తీస్కబోతేగూడ వీలొపోక్కలే ద్గనాక్కయ్న గోప్పడి, చ. మీ కింకన్బద్దిలేదు అని వెల్లొచ్చిండు.

ఎన్నైబ కడ్పుంటదీ మాలోల్లయి మాదిగ్లయ్ కల్సి. మొత్తమ్మేచ్ఛ మరి

జన్నులమే అనోక్క. ఎన్నైబ గడ్ప దాకుంటది. అయ్తే యీ గబ్బెట్ల కట్టిచ్చి న్లక్కడ. ఈ జన్గాంతాలూకా కిందనే. ఇక్కడే, వూరు గబ్బెటని. అక్కడోటి గూడ గట్టిచ్చిన్లు. ఇంత వరకు మాకు సహాయం జేసిన్లు. ఇంక మాకు కొంచెం కాలేజీ జన్గాం తాలూకలో కాలేజెర్వ్జేసి మాకూ హార్జన ఆడిపిల్లల గొర్మగొల్లకు యిప్పన్పైక్కతె వున్నయ్ అనొక్కండి. మల్లగూడా కొంచం అందువాట్లో జేత్తె చాల ముందుబోతమని మాకు గవ్మెంటు మీద ప్రేమ.

# 10

# మాండలిక పద (బంధ) కోశం *

అంగన్లు - కొట్లు, దుకాణాలు

అంద్ల — అందులో

అక్కడ్కెల్లి - అక్కణ్ణుంచి

అజ్జేద్దం - మోసంచేద్దాం

అడ్డుకట్ట/అడ్డుకట్టు - ఆనకట్ట

అతడు/అతను - వాడు

అత్త/అత్తమ్మ/ అత్తయ్య - తల్లి సోదరుని భార్య, తండ్రి సోదరి, భార్య/భర్త తల్లి

అదన - సరైన కాలం (అనుకూలమైన కాలం)

అనారోజు - అనూరాధ (కార్తె)

అనేటి/అనేటువంటి - అనే

అన్నట్టు - అన్నమాట

అన్చెప్పి/అన్చెప్పేని — అని

అన్ల - అందులో

అంబటేల - పొద్దున (సూర్యోదయానంతరం)

అబాదుజేస్ - వ్యవసాయానికి అనుకూలమైన భూమిగా మార్చు

అమాన్పని - ధాన్యం బస్తాలు తూకంవేసే పని

అమ్మ - తల్లి, తల్లితల్లి, తండ్రితల్లి

అమ్మక్క - తల్లి అక్క

అయిట్ని — వాటిని

అలికగా - తేలికగా

అల్లుడు - సోదరి కుమారుడు, కూతురి భర్త

అవుసు - ఆయుష్యం

అవ్వ - తల్లి

అస్మంటి - అటువంటి

ఆడబిడ్డ/ఆడిబిడ్డ - భర్త సోదరి

ఆబాదీజేస్ - (చూ. అబాదుజేస్-)

అండ్లా - పైగా 'moreover'

ఇండ్లు - ఇళ్లు

ఇజ్జేస్కున్ - పరిష్కరించుకున్ (ంకొన్-)

ఇన్ల - ఇందులో

ఇన్లు - ఇళ్లు

ఇయ్యది - ఇయ్యదు/ఇవ్వదు

ఇల్లల - ఇళ్లల్లో

ఇస్తలేను మొ॥ - నేను ఇవ్వటంలేదు. మొ॥

ఈయొక్క - ఈ

ఉచ్చతంగ - ఉచితంగ

ఉడ్కు - వేడి

ఉత్తుత్తగనే - ఊరకనే (= ఏమీ పని లేకుండా)

---

* ఇందులో ఫ అనే అక్షరానికి ఇంగ్లీషులో fa తో సమానమైన ఉచ్చారణ. (వ్యవహారఖండికలలో కూడా ఈ అక్షరం వాడటం జరిగింది.)

ఉద్ది - ఇష్టం
ఉర్క్ — పరిగెత్తు
ఉల్లు - (చూ. ఊర్లు)
ఉస్కె — ఇసక
ఊకె — ఊరికే
ఊకొన్ — ఊర్కొన్
ఊరగర్చు - ఊళ్లోఖర్చు, పైఖర్చు
ఊర్లు - ఊళ్లు
ఎక్కాబుడ్డి - బుడ్డిదీపం (= దీపం బుడ్డి-చిన్నదీపం
ఎట్టిర్గీ - ఎట్లాగైనా
ఎదట్ల/ఎదట్లో - ఎదురుగా, సమక్షంలో
ఎనమండుగురు - ఎనిమిదిమంది
ఎన్లు - (చూ. ఏన్లు)
ఎల్ల్ - పో, (ధాన్యం) పండు,
ఎవనోకి - ఎవరికో
ఏడ్చిన్రు, మొ॥ - ఏడ్చేరు, మొ॥
ఏన్లు - ఏళ్ళు (= సంవత్స రాలు)
ఏర్వేస్ - తొలగించ్
ఒట్టిగ - ఊరికే (= పనిలేకుండా)
ఓరం - (మేము) ఒకరం
ఓర్ని - ఒకర్ని
కంక - వెదురు
కండురుమాలు - గళ్ళఉత్తరీయం
కండ్లు — కళ్ళు
కందిల్లు - లాంతర్లు
కతం - అయ్‌పో-'Exhaust'
కన్లు - కళ్ళు
కరీజ్జేస్—కొన్ 'buy'
కలుప - కలప
కల్సిండు, మొ॥ - కలిసేడు, మొ॥
కల్సె, - కలిసెను,
కాంటా - పెద్దత్రాసు
కాక - తండ్రి తమ్ముడు
కాకితం - కాయితం
కాని/కానీ - కాడి
కానిక - కానుక
కాన్లు (ఏక. కాని)—కాళ్లు (ఏక,కాడి)
కాయిదం - కాయితం
కాలంఅయ్ -మంచి కాలం కావటంచేత
కాలంబొయ్ - కాలం మంచిది గాక పోవటంచేత
కావన్లు (ఏక, కావడి) - కావళ్ళు
కిరాయ్ - అద్దె
కుంటలు - చిన్న చెరువులు, చెలమలు
కుదుర్కున్ - (ఉద్యోగంలో) చేరు
కునుకులు - కునికిపాట్లు
కులాయించ్ - తెరుచ్
కూర్పాట్లు - కునికిపాట్లు
కొంచబో - తీసుకుపో
కొడవండ్లు/కొడవన్లు - కొడవళ్లు
కోదండ్లు/కోదన్లు - కోడళ్ళు
గాడి - రైలుబండి
గిట్ల/గిట్ల - ఇట్లా
గిది - ఇది
గిరిన్ల - మిల్లులో
గీ - ఈ
గీన - మొదలైన
గుంజిపిచ్చ్ — లాగించ్
గుండ్లు - పెద్దపెద్దరాళ్లు

గుంతలు - గుంటలు
గుట్టలు/గుట్లు - చిన్నచిన్న కొండలు
గుత్త - contract
గున్లు - పెద్దపెద్దరాళ్ళు
గొడ్డన్లు - గొడ్డళ్ళు
గోర్లు — గోళ్ళు
చంపాయించ్ - సంపాయించ్
చక్కగా - బాగా, సూటిగా
చాదు - పెంచు
చినబాపు - తండ్రి తమ్ముడు
చిన్నంగ - నెమ్మదిగా, క్రమ క్రమంగా, మెల్లగా
చిన్నవ్వ/చిన్నాయి/చిన్ని - తల్లి చెల్లెలు
చిరాగు - దీపం
చీకటితోటి - పొద్దున్నే
చుట్టు - మైల (=సూతకం)
చూస్తె/చూసెదుంటె, మొ॥— చూస్తే, మొ॥
చెక్కర/చెక్కెర - పంచదార
చెయ్‌లు - చేతులు
చెర్పగం రాత్రి — అర్థరాత్రి
చెల్క/సెల్క - మెట్టపొలం
చెల్లె - చెల్లెలు
చెల్లెండ్లు/చెల్లెన్లు - చెల్లెళ్ళు
చేన్లు - చేలు
చేపిచ్చ్ - చేయించ్
చేసేటి - చేసే
జంతులు - జంతువులు
జాగ - స్థలం
జాడతెలుపు - భోగట్టానిచ్చ్.
జారుడు - పటవాలుతనం
జాలు - పటవాలు (=నీటి పారుదల కవకాశం)
జీతమ్ఁడీ - ఉద్యోగం చేసే
జెర్ర - కొంచం
జోకు - తూచు
జోకురాల్లు - తూకపురాళ్ళు
-తట్టు - -లాగా
తన్నకపోవ్డు, మొ॥ - తన్నకపోవటం, మొ॥
తన్నకున్నా, మొ॥- తన్నకపోయినా, మొ॥
తన్నుడు/తన్నేది, మొ॥- తన్నటం, మొ॥
తన్రి - తండ్రి
తబాయిదా - బదిలీ 'transfer'
తమ్మయ్య - తమ్ముడు
తమ్ముండ్లు - తమ్ముళ్ళు
తరత/తర్త - తరవాత
తరాజు - త్రాసు
తరి - మాగాణి భూమి
తర్ఫీదు - శిక్షణ
తానం—స్నానం, స్థలం
తానంజేస్ - స్నానంచేస్
-తీర్గ - -లాగా
తెలిపిచ్చ్ — తెలియజేస్
తెల్లారగట్ల - తెల్లవారుజామున, పొద్దున్నే
తెల్లార్పొద్దుగాల్నె - పొద్దున్నే
తెల్వదు - తెలీదు
తెల్వేదుంటె, మొ॥-తెలిస్తే, మొ॥

తెస్తడు, మొ॥ - తెస్తాడు; మొ॥
తొందర్తోటి - తొందరపడి, హడా వుడిగా
తొమ్మండుగురు - తొమ్మిదిమంది
తోడగల్పు - కలుపు (= పిచ్చి మొక్కలు)
తోయించ్ - తవ్వించ్
దగ్గర్గోపట్న - దగ్గర్లో
దగ్గుపడిసెం— జలుబు
దండోరావేయించ్ — చాటించ్, ప్రచారంచేస్
-దన్క - -వరకు
దప్పిక - దాహం
దఫ్తేదారు - పెద్ద బంట్రోతు 'head peon'
దర్జేస్ - కొన్
దాంట్ల/దాన్ల - దాంట్లో
దాయబెట్టి - దాచుకొని
దారికచ్చు - ప్రయాణ ఖర్చు
దుంతయ్, మొ॥- దున్నుతయ్, మొ॥
దుక్కు - దిక్కు 'direction'
దున్నక (నే), మొ॥- దున్నకుండా, మొ॥
దున్నొద్దు, మొ॥ - దున్నక్కర్లేదు, మొ॥
దురుస్తేస్ - బాగుజేస్ 'repair'
దూప - దాహం
దేవునికి - దేవుడికి
దొర - భూస్వామి, పెద్దరైతు
-నంక — తరవాత
నడిగొల్గ - మధ్యలో ఎత్తుగా ఉండే టట్లుగా
నడిజాం రాత్రి - అర్థరాత్రి
నవ్కరి — ఉద్యోగం
-నాక - తరవాత
నాగన్లు - నాగళ్ళు
నాడు- అప్పుడు (= అప్పటి రోజుల్లో)
నాయ్న - తండ్రి
-నించెల్లి - నుంచి
నిట్టూరం బెట్కున్- నిష్ఠూరపడు
నిన్న యివ్వాల - ఇటీవలి రోజుల్లో
నిబందనంజేస్ - నియామకంచేస్-
-నెంక - వెనక, తరవాత
నెమిల్లు - నెమళ్లు
నోము - (నోములు) నోచు
నోర్లు—నోళ్ళు
పండ్లు - పళ్లు 'fruit(s)'
పక్కకు - పక్కన
పక్కలో - పక్కన
పగటీల - మధ్యాహ్నం
పగలు - మధ్యాహ్నం
పట్ట పగలు - మధ్యాహ్నం
పట్టేదారు - భూస్వామి
పడిబడక - పడక (= ఒకరియందొక రికి ఇష్టం లేక పోవటం వల్ల)
పన్లు - పళ్ళు 'fruit(s)'
పర్హారీగోడ - ప్రహారీగోడ
పరేశానయ్ - బాధపడి, చికాకుపడి
పల్గొట్ట్ - పగలగొట్ట్
పలారం/పల్హారం - పలహారం (= ఫలహారం)
పలుగు - పగులు
పసులు - పశువులు (= ఎడ్లు/ దున్నలు)

పొజ్జట్టు - బూజు
పాట్లు - పాటలు
పిన్ని - తల్లి చెల్లెలు
పిన్నాన్లు — పిల్లలు
పిలగాడు/పిల్లగాడు—పిల్లవాడు
పిల్లగాన్లు - మగ పిల్లలు
పిల్వ, మొ। - పిలవను, మొ॥
పుకార్జేస్ - ప్రచారంచేస్
పులోర/పుల్హోర - పులిహోర (= ఒక ఫలహార విశేషం)
పెంట - ఎరువు 'fertilizer'
పెండ్లి - పెళ్ళి
పెట్టాలె, మొ॥ - పెట్టాలి, మొ॥
పెడ్తరు, మొ। — పెడ్తారు, మొ।
పెదబాపు — తండ్రి అన్న
పెద్దవ్వ - తల్లి అక్క
పెద్దరాత్రి - అర్ధరాత్రి
పెద్దాయి - తల్లి అక్క
పెన్లి - పెళ్ళి
పేన్లు - పేలు
పైరవీ - అదే పనిగ ఒక పని గురించి ప్రయత్నించటం
పొక్కలు — రంధ్రాలు
పొద్దటిపూట - పొద్దున
పొద్దటీలి — పొద్దున్నే
పొద్దుగాల - పొద్దున
పోవుడు, మొ॥ - పోవటం, మొ॥
ఫర్మానా - ప్రభుత్వ ఆజ్ఞాపత్రం
బంగపడు - మోసపోవు
బండ్లు/బను_బళ్ళు 'carts'
బస్తీ - నగరసీమ
బాట్లు - తూకపు రాళ్ళు
బాపమ్మ - తండ్రి తల్లి
బాపు - తండ్రి
బామ్మర్ది - బావమరిది
బావ/బావగారు—భర్త అన్న
బారానా- పణ్ణెండణాలు (= 3/4రూ॰)
బిడ్డ - కూతురు
బిస్తరు - పక్క (=పానుపు సామగ్రి)
బుగులు - గుబులు
బుద్దిగాక - బుద్ధి పుట్టక
బునియాద్ - పునాది
బేచిరాగు - దీపంలేని
బోగంజేయించ్ - పూజాదికాలు చేస్
మంచిది - సరే
మంచీల్లు - మంచినీళ్ళు (= తాగే నీళ్ళు)
మగోడు - భర్త, మగవాడు
మడికట్లు - బావి కింద సాగుచేసే భూములు
మద్యరాత్రి - అర్ధరాత్రి
మబ్బుల - పొద్దున్నే
మమ్ముల్ని - మమ్మల్ని
మర్దలు - మరదలు
మామ/మామయ్య - తల్లి అన్న, తండ్రి సోదరి భర్త, భార్య/భర్త తండ్రి
మారుమారు - మళ్ళీ మళ్ళీ
మాలు - సరుకు, సామాను
మావోల్లు - నా భార్య

మించిన – ఇంకా గొప్పదైన, ఇంకా మంచిదైన

మిర్రు – ఎత్తు

మిలుగు – మిగులు

-మీద్కెల్లి – -మీదినుంచి/-మీదుగా

ముచ్చట – సంగతి

మున్లు -ముళ్ళు (ఏ. ముల్లు)

ముసలామె – ముసలావిడ

మెట్న – ఎత్తు పల్లాలు సరిచూసే ఒక పరికరం

మెదులు – ప్రవర్తించ్

మెహతాబ్మా-తేసీల్ – ఒక ప్రభుత్వ ముద్ర పేరు

మేనోడు – మేనరికపు సంబంధం గలవాడు

మేనల్లు – సోదరి కుమారుడు

మొత్కున్ – గోలపెట్ట్

మొదల్గాలె – మొదట్నుంచి

మొనల్పెట్టిచ్చ్ – పదునుపెట్టిచ్చ్

మొహరు – ప్రభుత్వ ముద్ర

యూరాండ్లు/యూరాన్లు/యూరాల్లు – తోడికోడళ్లు

యూలేకోపోతే – అట్లా కాకపోతే

రకం – పన్ను 'tax' (= శిస్తు)

రసీట్టికెట్టు – రెవిన్యూ స్టాంపు

రాదారులు – రహదారులు

రాయకుంటె, మొ॥ – రాయకపోతే, మొ॥

రాస్తాన్రు, మొ॥ – రాస్తున్నారు, మొ॥

-రూపాలు – రూపాయలు

రూపక్కంగ – ద్వారా

రెక్క – చెయ్యి

రోని – రోహిణి (కార్తె)

రోలు – రోజులు

రౌతు – రాయి

లబించుకున్ – సముపార్జించుకున్

లాబ్దాయక్కాలు – ప్రయోజనకరమైనవి

లాయక్ – అనుకూలం, ప్రయోజనం

-లెక్క – -లాగా

లెక్క – భావం, ఉద్దేశం

లెక్కలు –గణితం (Mathematics)

లేకుంటా – ఉండకుండా

లేకుంటె – లేకపోతే

లేకుండిరి – లేరు

లేకుండె – లేకపోయెను

లేచింటి/లేచిన, మొ॥ – లేచాను, మొ॥

లేపోతే – లేకపోతే

లేవలె, మొ॥ – లేవలేదు, మొ॥

లేస్తి, మొ॥ – లేచాను, మొ॥

లొయ్యలు – లోయలు

-లోంచే – -లోనుంచే

-లోపట/లోప్ట – -లోపల

వచ్చుకుంట, మొ॥ -వస్తూ, మొ॥

వట్టిగ – (చూ. ఒట్టిగ)

వాకిన్లు – వాకిళ్లు

వాండ్లు/వాన్లు – వాళ్లు

వింటది, మొ॥ – వింటుంది, మొ॥

విచారిస్తున్నడు, మొ॥ – విచారిస్తున్నాడు మొ॥

విబ్బంది - ఇబ్బంది
వియ్యంకుడు/వియ్యంపుడు —
కొడుకు/కూతురు మామగారు
వియ్యంకురాలు/వియ్య(ం)పురాలు—
కొడుకు/కూతురు అత్తగారు
—విశయంగ - -సంబంధించి
వీన్లు — వీళ్లు 'these people'
వుత్తుత్తగ — (చూ. ఉత్తుత్తగ)
వుస్కె - (చూ. ఉస్కె)
వెద్దుర్లు - వెదుళ్లు
వెన్కాకు — పరోక్షంలో
వెయ్‌లు - వేలు 'thousands'
వెల్లొచ్చ్ - తిరిగివచ్చ్ 'return'
వేర్లు - వేళ్లు (ఏ. వేరు)
శురువై/శురూఅయ్ - మొదలయ్
శెక్కర - పంచదార
సంచి - బస్తా
సడ్డకులు - తోడల్లుళ్ళు
సదురుడు - సర్దుకోవటం
సబ్ - (చూ. సాబ్)
సముత్తయ్ - సమర్థాడి
సర్కార్/సర్కారి — ప్రభుత్వ
సర్ది - జలుబు
సర్పెట్ట్ - సరిపో
సాబ్ - అధికారి, అధికారిని సంబో-
ధించి చెప్పే పదం
సిర్ఫ్ — మాత్రం
సుక్రారం - శుక్రవారం
సుబా - మూడు జిల్లాల మేర
సుయ్యించ్ / సూయించ్- చూపించ్